Winner of Tourism Excellence Awards

# టూరిజం న్యూస్


అనంతశయన గుడి

TOURISM NEWS మైనాస్వామి పబ్లికేషన్స్ జూలై - ఆగస్టు - 2021 Rs. 25

దే వా నాం పి యే న పి య ద సి

## అశోకుడు మాట్లాడుతున్నాడు


కాకతీయ కళాసేవ


దోమకొండ


రాయఘడ్ కోట


Taramati Baradari


Lambasingi

# టూరిజం న్యూస్

మే - జూన్ - 2021 మరియు
జూలై - ఆగస్టు 2021

సంపుటి : 14 సంచిక : 3 & 4

సంపాదకుడు : మైనాస్వామి

MyNaa Swamy Publications
**TOURISM NEWS**
*( Telugu Bi-Monthly )*

*May - June - 2021 and*
*July - August 2021*
*Volume : 14 Issue : 3 & 4*



Editor : **My.Naa. Swamy**
(Mylaram Narayana Swamy)
**Editorial Mob. : 9502659119**

**Reporters : G.V. Chary,** Delhi
**Gundlapalli Siva Kumar**
**M. Manjunath**
**B. Murali Mohan Rao**
**Marketing : Sadguru News Agency**
Hyderabad. Telangana State, Mob. : **9502098191**
**Regd. Off. :** 19-12-372, Bairagipatteda,
**TIRUPATI - 517 501**. A.P., **Mob. : 9502659119**
email:tourismnews2007@yahoo.co.in
**www.issuu.com/mynaaswamy**
**Anantapuram Office :** Tourism News, 1-50, SPVM College Road, Opp. Market yard, Gorantla - 515 231, Anantapuram Dist. A.P.


# 15th Anniversary Issue

## సూచిక

# అమరలోకం

■ గుండ్లపల్లి శివకుమార్




వేలాది సంవత్సరాల సాంస్కృతిక ప్రవాహానికి ప్రతీక. హిందువులకు పరమ పావన క్షేత్రం. వారణాసిలో యేటా లక్ష లాది మంది యాత్రికులు గంగాస్నానం, దైవ దర్శనం చేసుకొంటారు. ఇక్కడ విశ్వేశ్వరాలయంలోని శివలింగం ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటి. స్వయంగా శివుడు కొలువైవున్నాడని హిందువుల నమ్మకం. గంగా స్నానం వల్ల ముక్తి లభిస్తుందని భక్తుల నమ్మకం. కాశీలో జరిగే గంగ హారతి భక్తులను తన్మయత్వానికి గురిచేస్తుంది. అష్టాదశ శక్తి పీఠాలలో కాశీ కూడా ఒకటి. దక్షయాగంలో ఆత్మార్పణం చేసిన సతీదేవి చెవిపోగు పడిన చోట ఇప్పుడు విశాలాక్షి మందిరం ఉందంటారు. గంగమ్మ తల్లి శక్తి స్వరూపిణి. కనుక శాక్తేయులకు కాశీ పరమ పవిత్ర క్షేత్రం. ఆదిశంకరుడు తన బ్రహ్మ సూత్ర భాష్యాన్ని, భజ గోవింద స్తోత్రాన్ని కాశీలో రచించాడంటారు. వారణాశిలో వేలాది ఆలయాలున్నాయి. అందులో ముఖ్యమైనవి విశ్వనాధ మందిరం, హనుమాన్ మరియు దుర్గా మందిరం. బుద్ధుని కాలంలో ఇది కాశీ రాజ్యానికి రాజధాని. కాశీ ఉత్తరప్రదేశ్‌లో ఉంది. కాశీ నుంచి లోక్ సభకు ప్రాతినిధ్యం వహిస్తున్న భారత ప్రధాని నరేంద్ర మోడి వారణాసి కాశీవిశ్వేశ్వర స్వామి ఆలయ అభివృద్ధికి, గంగానది ప్రక్షాళనకు అత్యంత ప్రాధాన్యతనిస్తున్నారు. కాగా 'నమో దేవదేవ.. నమో భక్తపాలా' అంటూ భక్తులు కాశీవిశ్వేశ్వర స్వామిని ప్రస్తుతిస్తుంటారు.

వరుణ, అస్సి అనే రెండు నదుల సంగమాల మధ్య ఉన్నందున "వారణాసి" అనే పేరు వచ్చిందని ఒక అభిప్రాయం. వారణాసి నగరానికి ఉత్తరాన వరుణ, దక్షిణాన అస్సి సంగమం స్థానం ఉన్నాయి. సుమారు ఐదువేల సంవత్సరాల క్రితం శివుడు వారణాసి నగరాన్ని స్థాపించాడని పౌరాణిక గాథల సారాంశం. ఇది హిందువుల ఏడు పవిత్ర నగరాలలో ఒకటి. ఋగ్వేదం, రామాయణం, మహాభారతం, స్కాంద పురాణం వంటి అనేక



ఆధ్యాత్మిక గ్రంథాలలో కాశీనగరం ప్రసక్తి ఉంది. కాశీ మూడువేల సంవత్సరాల నుండి ఉందని చరిత్ర కారులు భావిస్తున్నారు. విద్యకు, పాండిత్యా నికి, శిల్పం, వస్త్రం, సుగంధ ద్రవ్యాలవంటి వస్తువుల వ్యాపారానికి కేంద్రంగా ఉంటూ వచ్చింది. బుద్ధుని కాలంలో ఇది కాశీ రాజ్యానికి రాజధాని. చైనా యాత్రికుడు హుయాన్‌త్సంగ్ ఈ నగరాన్ని గొప్ప ఆధ్యాత్మిక, విద్యా, కళా కేంద్రంగా వర్ణించాడు. ఇది గంగానదీ తీరాన 5 కిలోమీటర్ల పొడవున విస్తరించిందని రాశాడు.

### స్థలపురాణం

కాశీ శివస్థాపితమని పురాణకథనాలు వివరిస్తు న్నాయి. బ్రహ్మ స్వయంగా ఇక్కడ పది అశ్వమేధ యాగాలు చేసి శివుడిని ఇక్కడ కొలువుండమని కోరాడని పురాణ గాథ. కురుక్షేత్ర యుద్ధం తరువాత పాండవులు భాతృహత్య మరియు బ్రహ్మహత్యా పాతకాల నుండి విముక్తులవడానికి సప్తముక్తిపురా లలో ఒకటైన కాశీకి విచ్చేశారు. అయోధ్య, మధుర, గయ, కాశి, అవంతిక, కంచి, ద్వారక నగరాలు సప్తముక్తి పురాలని హిందువుల విశ్వాసం... ప్రపంచంలో నిరంతరంగా నివాసయోగ్యమైన ప్రదేశాలలో కాశీ ప్రథమ స్థానంలో ఉందని భావిస్తున్నారు. పురాతత్వ అవశేషాలు *(మిగతా 10వ పేజీలో)*



# కాకతీయ కళాసేవ

■ ప్రొఫెసర్ కొక్కొండ విజయబాబు

దక్షిణ భారతాన్ని అమరావతి రాజధానిగా పరిపాలించిన శాతవాహనులు (క్రీపూ. 200 - క్రీ.శ. 200) వేద సంస్కృతి - సాంప్రదాయాలను అనుసరించి సుస్థిరమైన పరిపాలనను అందించారు. శాతవాహనులలో ప్రముఖ రాజులైన గౌతమీపుత్ర శాతకర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణి, హాలుడు మొదలగు వారి కాలంలో దక్షిణ భారతదేశంలో సుస్థిర పరిపాలన అందించబడి దేశం సిరిసంపదలతో తులతూగినట్లుగా నాటి సాహిత్యం, విదేశీ యాత్రికుల రచనలు తెలియచేస్తున్నాయి. శాతవాహనుల అనంతరం ఇక్ష్వాకులు (క్రీ.శ. 210-300), విష్ణు కుండినులు (క్రీ.శ. 420-624), చాళుక్యులు (క్రీ.శ. 543-753), రాష్ట్ర కూటులు (క్రీ.శ. 753-982) మొదలగు వారు దక్షిన భారత దేశంలోని వివిధ ప్రాంతాలను పరిపాలించారు, వీరి పరిపాలనా కాలంలో వేద సంస్కృతి పరిరక్షణ, సర్వమత సామరస్యం సాధింపబడి సాహిత్య, శిల్ప కళాభివృద్ధి జరిగింది. చాళుక్యుల పతానంతరం ఓరుగల్లు రాజధానిగా కాకతీయ సామ్రాజ్యం (క్రీ.శ. 1000-1323) హిందూ ధర్మ పరిరక్షణకు, తెలుగు భాష సాహిత్య వికాసానికి కృషి చేశారు. కాకతీయ, విజయనగర కాలంలో రచించబడిన కావ్యాలు మరియు నిర్మించబడిన దేవాలయాలు నాటి సాంస్కృతిక విలువలను ప్రతిబింబిస్తాయి. వీరి పాలన కాలంలో సుస్థిర పరిపాలన, ఆర్థికాభివృద్ధి మరియు సాంస్కృతిక వికాసం అత్యున్నత దశకు చేరిందని చారిత్రక ఆధారాలు తెలియచేస్తున్నాయి. వీరిని స్ఫూర్తిగా తీసుకున్న మధుర నాయకులు కూడా తెలుగు భాష, సాంస్కృతిక వికాసానికి తమ వంతు కృషి చేశారు. కాకతీయ, విజయనగర మరియు మధుర నాయకుల పాలనా కాలంలో జరిగిన భాష, సాహిత్య మరియు సాంస్కృతిక వికాసాన్ని పరిశీలించడం ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశ్యం.







పాలకులైన రుద్రదేవుడు (క్రీ.శ. 1158-1195), మహాదేవుడు క్రీ.శ. 1195 -1198, గణపతి దేవుడు (1262 -1199), రుద్రమదేవి 1289 -1262, ప్రతాపరుద్రుని (క్రీ.శ. 1289 -1323) పాలనలో దేశం సుభిక్షమై కళా సాహిత్యాలు ఎంతో అభివృద్ధి చెందాయి. కాకతీయుల కాలంలో తవ్వించిన ఎన్నో చెరువులు ఇప్పటికి చక్కటి



**కాకతీయులు:** కాకతీయ రాజులు ఓరుగల్లును రాజధానిగా చేసుకొని తెలుగు ప్రాంతాలను సుమారుగా క్రీ.శ. 1000 నుంచి క్రీ.శ. 1323 వరకు పరిపాలించారు. క్రీ.శ. 10-12 శతాబ్దాల కాలంలో సామంత కాకతీయ రాజులు బేతరాజు - 1, (క్రీ.శ. 1000-1052): ఇతని శాసనం కాజీపేటలో దొరికింది. దీని ప్రకారం ఇతని బిరుదు 'కాకతిపురాధినాథ'. ప్రోలరాజు - 1 (క్రీ.శ. 1052 - 76): వరంగల్ దగ్గర కేసరి సముద్రం తటాకాన్ని నిర్మించాడు. ఇతని బిరుదు 'కాకతివల్లభ, అరిగజకేసరి'.

***బేతరాజు-2 (క్రీ.శ. 1076- 1108):*** హన్మకొండ దగ్గర శివపురం అనే నగరం నిర్మించి అక్కడ బెతేశ్వరాలయం నిర్మించాడు.

***దుర్గరాజు - 2 (క్రీ.శ 1116-1151):*** సామంతులలో చివరివాడు, మొట్టమొదటి స్వతంత్ర రాజు. యాదవులు కళ్యాణి చాళుక్యులను అంతం చేయడంతో ఇతడు స్వంతత్రాన్ని ప్రకటంచు కొన్నాడు. ప్రోలరాజు - 2 ద్రాక్షారామ యుద్ధంలో వెలనాటి చోడుల చేతిలో హతమయ్యాడు.

***స్వతంత్ర కాకతీయ రాజులు:*** కాకతీయ సామ్రాజ్య

స్థితిలోనే ఉన్నాయి. ఆ రాజులు, వారి సామంతులు సాగునీటి కాలువల అభివృద్ధికి ఎంతగా కృషి చేవారో తెలియచెప్పే సజీవ సాక్ష్యాలు అవి. వారి పాలనలో వ్యవసాయం, వ్యాపారం, విదేశీ వాణిజ్యం



అత్యున్నత దశకు చేరినదని నాటి సాహిత్యం, విదేశీయుల రచనలను బట్టి చెప్పవచ్చు. రుద్రమ దేవి ఆస్థానాన్ని సందర్శించిన మార్కోపోలో అనే వేనీస్ (ఇటలి) యాత్రికుని రచనలు ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు.

కాకతీయ రాజులు సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు. వారి కాలంలో సాహిత్యం ఎంతో అభివృద్ధి చెందింది. చివరి కాకతీయ రాజు ప్రతాపరుద్రుని ఆస్థానంలో కవి అయిన విధ్యానాధుడు సంస్కృతం లో రాసిన అలంకార శాస్త్ర గ్రంథం, ప్రతాపరుద్రీయం లేక ప్రతాపరుద్రయతో శోభూషణం ఎంతో ప్రముఖమైనది. వినుకొండ వల్లభామత్యుడు రచించిన తెలుగు గ్రంథము క్రీడాభిరామము. పాల్కురికి సోమనాధుని పండితారాధ్య చరిత్రము, కొలను గణపతిదేవుడు రచించిన సమకాలీన తెలుగు గ్రంథం శివయోగ సారము, కాకతి రుద్రదేవుడు స్వయంగా రాసిన గ్రంథం నీతి సారము, బద్దెన రాజనీతి శాస్త్రంపై రాసిన గ్రంథం నీతి శాస్త్ర ముక్తావళి, గణపతి దేవుని సేనాని అయిన జాయాప సేనాని సంస్కృత గ్రంథం - నృత్య రత్నావళి.. ఇవి నాటి సాహిత్యంలో సుప్రసిద్ధ రచనలు.

***నిర్మాణాలు:*** కాకతీయుల పాలనా కాలంలో పలు నిర్మాణాలు చేపట్టబడ్డాయి. మధ్యయుగం నాటి హిందూ రాజుల కోటలు ఎలా ఉండేవో తెలపడానికి కాకతీయుల ఓరుగల్లు కోట నమూనాగా నిలు స్తుంది. పాలంపేట, జాకారం, రామానుజపురం, కటాక్షపూర్, గణపురం, వరంగల్, హనుమకొండ, పిల్లల మఱ్ఱి, నాగులపాడు, కూసుమంచి. ఇంకా తదితర ప్రదేశాల్లో వాళ్ళు నిర్మించిన దేవాలయాలు, ఆకాలపు వాస్తు శిల్ప కళలకు నిదర్శనం. అట్టివాటిలో రామప్ప దేవాలయం, వెయ్యి స్తంభాల దేవాయలయం, స్వయంభు దేవాలయం, కుసుమంచిలోని గణపేశ్వరాలయం మొదలగునవి ఎంతో విశిష్టమైనవి. కుడ్య ఫలకాలపై చెక్కిన మానవాకృతులు, ఆకాలపు వేష భూషణాలను, క్రీడలను, నాట్య రీతులను ఆ సమాజపు సౌందర్యాభిరుచిని ప్రతిబింబిస్తాయి.



కాకతీయుల రాజధాని నగరమైన ఓరుగల్లు సిరి సంపదలతో తులతూగి అంతర్జాతీయ ఖ్యాతిని అర్జించింది. వీరి రాజధాని ఏకశిలా నగరంగా పేరు గాంచింది. ఈ కోట గణపతి దేవుని కాలంలో నిర్మించబడి రుద్రమదేవి, ప్రతాప రుద్రుని కాలంలో



మరింత పటిష్ట పర్చబడింది. ఇది శత్రు దుర్భేద్యమై రాజ్య రక్షణలో ప్రముఖ పాత్ర వహించింది. కోటలో నిర్మించబడిన, మంది రాలు, మంటపాలు, అద్భుతమైన శిల్ప సౌందర్యానికి పేరెన్నిక గన్నవి. దీనిపై పలు మార్లు సాగిన ముస్లింల దాడుల ఫలితంగా స్వయభు దేవాలయంతో పాటు ఇతర ఎన్నో ఆలయాలు నేడు శిథిలావస్థలో కనిపిస్తాయి.

హన్మకొండలో నిర్మించబడిన వెయ్యి స్తంభాల దేవాలయం మరొక అద్భుత నిర్మాణం. దీనిని రుద్ర దేవ - 2 క్రీ.శ. 1163లో నిర్మించాడు. ఈ ఆలయంలో పెక్కు స్తంభాలు ఉండడం వలన దీనిని వెయ్యిస్తంభాల దేవాలయమని పిలుస్తారు. ఇది త్రికుటాలయం. శివలింగం పూజలందు కొంటున్నది. విష్ణు విగ్రహం, సూర్య భగవానుని విగ్రహాలు ముస్లిం దాడులలో ధ్వంసం చెయ్యబడి నట్లు తెలుస్తున్నది. ఈ ఆలయంలోని నంది విగ్రహం సుమారు ఎనిమిది అడుగుల ఎత్తు, పన్నెండు అడుగుల పొడవుతో నల్లటి నునుపైన రాయిపైన చెక్కిన ఏకశిలా నిర్మాణం.

**రామప్ప దేవాలయం** వరంగల్ జిల్లా ములుగు ప్రాంతంలోని వెంకటాపూర్ మండలంలో పాలంపేట అనే గ్రామంలో ఉంది. దీనిని గణపతి దేవుని సైన్యాధిపతి అయిన రేచర్ల రుద్రుడు క్రీ.శ. 1213లో నిర్మించడం జరిగింది. ***ఈ శైవ ఆలయంలో కాకతీయ శిల్ప సౌందర్యం, నిర్మాణం అత్యున్నత దశకు చేరినట్లుగా తెలుస్తుంది. ఆలయ స్తంభాలపై నాటి జీవన విధానం, సంగీత వాయిద్య పరికరాలు, నృత్య రీతులు, పురాణాలు, ఇతిహాసాల కు సంబంధించిన శిల్పాలు చెక్కబడ్డాయి.*** ఈ ఆలయంలోని శివలింగం, నంది విగ్రహం, మదనిక శిల్పాలు, శిఖర నిర్మాణానికి ఉపయోగించిన నీటిలో తేలియాడే ఇటుకలు సందర్శకులను సంభ్రమాశ్చర్య లకు గురిచేస్తాయి.

***సామ్రాజ్య పతనం:*** ఈ విధంగా సర్వతోముఖాభి వృద్ధి చెందిన కాకతీయ సామ్రాజ్య వైభవం పై తురుష్కుల కన్ను పడింది. నాటికి ఉత్తరాపథం ఢిల్లీ సుల్తానుల పాదా క్రాంతమై, వారి దృష్టి దక్షిణాపథం పైకి మరలింది. దక్షిణాపథంలో కాకతీయ సామ్రా జ్యాన్ని పాలిస్తున్నది రెండవ ప్రతాపరుద్రుడు. ఇతని పాలనా కాలంలోనే కాకతీయ సామ్రాజ్య విచ్ఛిన్నం ఆరంభమైంది. ప్రతాప రుద్రుని పాలనా కాలమంతా అంతరంగిక విప్లవాలను అణచడంలోను, విదేశీ దండయాత్రలను ఎదుర్కొనడంలోను గడిచిపోయిం ది. రెండో ప్రతాపరుద్రుని కాలంలో కాకతీయ రాజ్యంపై ముస్లింలు 8 సార్లు దండెత్తారని, అందులో ప్రతాపరుద్రుడు 7 సార్లు ముస్లింలను ఓడించి తరిమివేశాడని, 8వ సారి జరిగిన దాడిలో ఓడిపోయి పట్టుబడ్డాడని ప్రోలయ నాయకుని విలాసశాసనం, ప్రతాప చరిత్ర, కలువ చెరువు శాసనాలు తెల్పుతున్నాయి. (ముస్లిం చరిత్రకారులు 5 సార్లే దాడులు చేశారని రెండు విఫలం అయ్యాయని, మిగిలిన దాడుల్లో ముస్లిం సైన్యాలు విజయం సాధించాయని పేర్కొన్నారు.) క్రీ.శ. 1303లో అల్లా ఉద్దిన్ ఖిల్జీ పెద్ద సైన్యంతో మాలిక్ ఫక్రుద్దీన్ జునాను బెంగాల్ మీదుగా ఓరుగల్లు పైకి పంపినాడు. దీనిలో ముస్లిం సైన్యాలు పరాజయం పాలైనాయి. మరల క్రీ.శ. 1309లో మాలిక్ కాపర్ అనే సేనానిని పంపినాడు. అనుమకొండ నుండి ఓరుగల్లు కోటపై ముట్టడి జరిగింది. గత్యంతరం లేక ప్రతాపరుద్రుడు మాలిక్ కాపర్‌తో సంధి చేసుకొన్నాడు. క్రీ.శ. 1318లో అల్లా ఉద్దిన్ కుమారుడైన కుతుబుద్దీన్ ముబారక్ షా తన బానిస – ఖుస్రుఖాన్‌ను కొంత సైన్యంతో వరంగల్‌కు పంపాడు. ప్రతాపరుద్రుడు ఖుస్రును ప్రతిఘటించ కుండా శాంతిని కోరి సంధి చేసుకొన్నాడు. ఘియా జుద్దీన్ తుగ్లక్ క్రీ.శ 1320లో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించి తనకు తానే సుల్తాన్‌గా ప్రకటించుకొ


మందడం శాసనం

న్నాడు. ఇతని కాలంలోనే నాలుగవ దండయాత్ర క్రీ.శ. 1323లో జరిగింది. ఈ దండయాత్రను నడిపింది ఉల్గూఖాన్ బిరుదాంకితుడైన జూనాఖాన్ (మొహ్మద్ బిన్ తుగ్లక్). ఈ యుద్ధంలో ప్రతాప రుద్రుడు బందీకాబడి శత్రువులచే ఢిల్లీకి తీసుకుపోబడుతుండగా మార్గమధ్యంలో నర్మదా నదిలో దూకి ఆత్మార్పణ చేసుకొన్నట్లుగా తెలుస్తు న్నది. కాకతీయ సామ్రాజ్యం స్థానిక కాయస్థ, వెలమ, రెడ్డి, వర్ణ వైషమ్యాలతో మరియు అంతర్గత తిరుగుబాట్లతో బలహీనపడింది. అదే సమయంలో ఢిల్లీ నుంచి పలు మార్లు దాడులను ఎదుర్కొని చివరకు అంతరించింది.

*(రచయిత చరిత్ర మరియు పర్యాటక శాఖ అధిపతి, కాకతీయ విశ్వ విద్యాలయం, వరంగల్)*



# తిరువళ్ళూరు పుణ్యక్షేత్రం





**తిరువళ్ళూరు తమిళనాడు రాష్ట్రంలోగల సుప్రసిద్ధ వైష్ణవ పుణ్యక్షేత్రం. ఇక్కడ 108 వైష్ణవ ప్రధాన ఆలయాలలో ఒకటైన వీర రాఘవుల ఆలయం ఉంది. ఇక్కడి ప్రధాన దైవం వీర రాఘవ పెరుమాళ్. ప్రధాన దేవి కనకవల్లియార్. తీర్థం- హృత్తాప నాశతీర్థం. విగ్రహం ఆదిశేషుడిపై విష్ణువు శయనించి నట్లుగా ఉంటుంది. ఆలయ శిల్పకళ ఆకట్టుకుంటుంది. వీర రాఘవ స్వామి మందుల తలకింద పెట్టుకున్నాడు. కాబట్టి ఆయన దర్శనం చేసుకుంటే వ్యాధులు నయమవుతాయని ప్రజల విశ్వాసం. ఇక్కడ గల కోనేరు దేశంలోని అతి పెద్ద కోనేర్లలో ఒకటి.**

స్థలపురాణం అనుసరించి తై అమావాస్య అంటే సంక్రాంతి తరువాత వచ్చే అమ్మావాస్య రోజున మహర్షి తపసుకు మెచ్చిన శ్రీమన్నారా యుణుడు ముసలి వాడి వేషంలో వచ్చి మహర్షి పెట్టిన బియ్యపు పిండిని ఆహారంగా స్వీకరించి ఆయన నేసిన మూడు గజముల వస్త్రమును ధరించి ఆ రోజు రాత్రి ఆయన గృహములో నివసించడానికి చోటు చూపమని అడిగాడు. ఆయన చూపిన గదిలో ఆ రాత్రికి విశ్రమించాడు. మరునాడు ఉదయం మహర్షి శాలిహోత్రుడు తన నిత్య పూజా కార్యక్రమాలను చేసి ముసలి వాడివద్దకు వచ్చి చూడగా అక్కడ శేషశైనంలో పవళించి లక్ష్మీ దేవితో నాభికమలంలో బ్రహ్మదేవు డితో సహ శ్రీమన్నారయణ విగ్రహం కనిపిం చింది. తరువాత విష్ణుమూర్తి ప్రత్యేక్షమై ఏమి వరం కావాలో కోరుకొమ్మని మహర్షితో చెప్పగా ఆయన తన మోక్షం మాత్రమే కావాలని అయినా ఇక్కడకు వచ్చి దర్శించుకునే భక్తులకు ఆరోగ్యాన్ని కలిగిస్తూ శ్రీవైద్య వీర రాఘవుడిగా ఉండి వారి కోరికలను పూర్తి చేసి వారికి ప్రశాంత జీవితాన్ని ఇచ్చి, పోగొట్టుకున్న సంపదలని తిరిగి పొందేలా చేయమని, ఎటువంటి కష్టాలైన తొలగించి ఆరోగ్యాన్ని, ఐశ్వర్యాన్ని అందించమని కోరుకు న్నాడు. అమావాస్య రోజు మాత్రం ఆలయం భక్తులతో రద్దీగా ఉంటుంది. శని- ఆదివారాలు కూడా ఆలయం భక్తులతో రద్దీగానే ఉంటుంది. ఈ ఆలయంలో లక్ష్మి దేవికి ప్రత్యేక సన్నిధి కలదు. రాముల వారికి, శ్రీకృష్ణుడికి కూడా ప్రత్యేక సన్నిధు లు ఉన్నాయి. ఆలయ శిల్పకళ ఆకట్టుకుంటుంది.



1830-31 సంవత్సరాల్లో తన కుటుంబం, సేవకులు, పరివారంతో కాశీయాత్ర చేసిన ఏనుగుల వీరాస్వామయ్య తొలి యాత్రా చరిత్రగా రాశారు. ఈ ప్రయాణం ఈ గ్రామం మీదుగా సాగింది. వారు ఇక్కడ విడిది చేయడంతో ఈ గ్రామంలో 1830 సమయంలో స్థితిగతులు ఎలా ఉండేవో ఆ గ్రంథంలో ఉన్నాయి. ఏనుగుల వీరాస్వామయ్య ఆ గ్రంథంలో... "తిరువళ్ళూరు విష్ణుస్థలము. హృత్తాపనాశిని అనే తీర్థమున్నది. అందులో భక్తులు బెల్లము వేయుచున్నారు. ఆ తీర్థస్నానము స్మృతుల యందు మహాప్రాయశ్చిత్తములలో ముఖ్యముగా చెప్పబడింది. అది పేట స్థలము. అన్ని వస్తువులు దొరకును".



మేషం, పునర్వసు మొదలు, మకర మాసం పూర్వభాద్ర చివరిరోజుగా పది రోజులు బ్రహ్మో త్సవములు నిర్వహిస్తుం టారు. ప్రతి అమావాస్యకు ప్రార్థనలు చెల్లించు టకై భక్తులు వస్తుంటారు. ఈ సన్నిధి అహోబిల మఠం జీయర్ స్వామివారి నిర్వాహణలో ఉంది. సన్నిధి వీధిలో అహోబిల మఠం ఉంది.

చెన్నై - అరక్కోణం రైలు మార్గంలో తిరువళ్ళూరు స్టేషన్ నుంచి 5 కి.మీ. వుంటుంది.

# అమరలోకం



(4వ పేజి తరవాయి)

వారణాశి వేదకాల ప్రజల అవాసమని వివరిస్తున్నాయి. కాశీ పట్టణం గురించి ప్రధమంగా అధర్వణ వేదంలో వర్ణించబడింది.

**వివరణ**

కాశీ అతి ప్రాచీన నగరాల్లో ఒకటి. హిందువులకు అత్యంత పవిత్రమైన పుణ్యక్షేత్రము. ఇక్కడ ప్రవహించే గంగానదిలో స్నానం ఆచరిస్తే పునర్జన్మ నుంచి విముక్తులౌతారని నమ్మకం. బ్రిటిషు వారి హయాంలో వారణాసి బెనారస్ అయింది. కాశ్యాస్తు మరణాన్ ముక్తి:- "కాశీలో మరణిస్తే ముక్తి లభిస్తుంది" అని హిందువులు విశ్వసిస్తారు. ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటైన విశ్వేశ్వర లింగం ఇక్కడ వుంది. బౌద్ధులుకు, జైనులకు కూడా ఇది పుణ్యక్షేత్రం. గంగానది, హిందూమతము, హిందూస్తానీ సంగీతము, పట్టు వస్త్రాల నేత, హిందీ మరియు సంస్కృత పండితుల పీఠం. వారణాసికి గంగానది ఆవలివైపున రామనగరం ఉంది. వారణాసి సమీపంలో సారనాథ్ బౌద్ధ క్షేత్రం వుంది. విశ్వేశ్వరాలయం, అన్నపూర్ణాలయం, విశాలాక్షి ఆలయం, వారాహీమా తాలయం, తులసీ మానస మందిరం, సంకట మోచనాలయం, కాల భైరవాలయం, దుర్గా మాత దేవాలయం, భారతమాత మందిరం ఇలా కాశీలో ఎన్నో దేవాలయాలున్నాయి. దశాశ్వమేధ ఘట్టం, హరిశ్చంద్ర ఘట్టం వంటి పలు స్నాన ఘట్టాలున్నాయి. వారణాసిని "దేశపు ఆధ్యాత్మిక రాజధాని", 'దీపాల నగరం', 'విద్యా నగరం', 'సాంస్కృతిక రాజధాని'గా రచయితలు వర్ణిస్తున్నారు.

**విశ్వనాధ మందిరం**

కాశీ విశ్వనాధ మందిరం గంగానది ఒడ్డున దశాశ్వమేధ ఘాట్ వద్ద వుంది. దీని గోపురంపై పూసిన బంగారు పూత కారణంగా దీనిని "బంగారు మందిరం" అని అంటారు. ప్రస్తుతం ఉన్న మందిరాన్ని 1780లో ఇండోర్ రాణి అహల్యాబాయి హెూల్కర్ కట్టించింది. ఇందులో లింగాకారంగా కొలువై వున్న దేవుడు "విశ్వేశ్వరుడు" "విశ్వనాధుడు" పేర్లతో పూజలందుకొంటున్నాడు.

ఈ ఆలయం పలుమార్లు విధ్వంసం చేయబడగా తిరిగి నిర్మించబడింది. 1839లో పంజాబ్ కేసరిగా పేరొందిన మహారాజా రంజిత్ సింగ్ ఈ ఆలయం రెండు గోపురాలకు బంగారం పూత పూయించాడు. కాశీ విశ్వనాధాలయానికి సమీపంలో అన్నపూర్ణాదేవి గుడి ఉంది. విశ్వనాథుని దర్శించుకొన్న తరువాత భక్తులు అన్న పూర్ణాదేవి పూజలో పాల్గొంటారు. ఈ దేవాలయంలో అన్నదానం నిర్వహించబడుచున్నది. సమీపంలో విశాలాక్షి అమ్మవారి మందిరం ఉంది. భక్తులు విశాలాక్షిదేవి కటాక్షం పొందుతారు. సింధియా ఘాట్ వద్ద శాంక్త మందిరం ఉంది. శాంక్తా మందిరంలో పెద్ద సింహం శిల ఉంది.

**దుర్గా మందిరం**

వారణాశిలో రెండు దుర్గామందిరాలున్నాయి. 500 సంవత్సరాలకు ముందు నిర్మించిన దుర్గా మందిరం ఒకటి. రెండవది "కోతుల గుడి"గా కూడా ప్రసిద్ధమైన దుర్గా మందిరం 18వ శతాబ్దంలో బెంగాలీ రాణిచే నిర్మించబడింది. ఇక్కడ చాలా కోతులు ఉండడవ వల్ల కోతుల గుడి అని అంటారు. ఇక్కడ అమ్మవారు స్వయంభూమూర్తి అని భక్తుల నమ్మకం. ఆలయం గోపురం ఉత్తర భారత 'నాగర' శైలిలో నిర్మింపబడింది.

**దశాశ్వమేధ ఘాట్**

గంగా తీరం స్నానఘట్టాలతో నిండి ఉంది. యాత్రీకులు స్నానం ఆచరించడానికి, సంప్రదాయక ఆచారాలను పాటించడానికి అనువైన ఏర్పాట్లున్నా యి. కాశీలో 84 ఘాట్‌లు ఉన్నాయి. కాశీ విశ్వనాథ మందిరం ప్రక్కనే ఉన్న దశాశ్వమేధ ఘాట్ వారణాశిలో ఉన్న స్నాన ఘట్టాలలో అతి పురాతన మైంది. ఇది యాత్రికులతో ఎప్పుడూ రద్దీగా ఉంటుంది. బ్రహ్మ స్వయంగా ఇక్కడ పది అశ్వమేధ యాగాలు చేసి శివుడి ఇక్కడ కొలువుండమని కోరాడని పురాణ గాధ.

ప్రతి రోజూ సాయంకాలం పూజారులు ఇక్కడ అగ్నిపూజ చేసి, శివుడిని, గంగమ్మను, సూర్యుడిని, అగ్నిని, విశ్వాన్ని కొలుస్తారు. ఇక్కడ శూలకంఠేశ్వ రుడు, బ్రహ్మేశ్వరుడు, వరాహేశ్వరుడు, అభయవినాయక ఆలయాల తో గంగా, బండిదేవి ఆలయాలున్నాయి. ఇక్కడ ప్రతిరోజు నిర్వహించే "గంగా హారతి" ఒక



అద్భుత ఘట్టం. ఘాటు వద్దకు బోట్లను తీసుకువచ్చి నదిలో నిలిపివేస్తారు. యాత్రీకులు అక్కడి నుండి హారతి చూడవచ్చు.

**మణి కర్ణికా ఘాట్**

మణి కర్ణికా ఘట్టం ఎంతో పావనమైనదిగా హిందువులు భావిస్తారు. ఒక గాధ ప్రకారం శివుని సమక్షంలో విష్ణువు ఇక్కడ తన సుదర్శన చక్రంతో ఒక గోతిని తవ్వాడు. దానిని తన స్వేదంతో నింపుతుండగా విష్ణువు చెవి కుండలం (మణికర్ణిక) అందులో పడింది. మరొక కథ ప్రకారం పార్వతీ దేవి తన చెవిపోగు (మణికర్ణిక) ను ఇక్కడ దాచిపెట్టి, దానిని వెతకమని శివుడిని కోరింది. దానికోసం వెతుకుతూ శివుడు అక్కడే ఉండిపోవడం వల్ల అతడు దేశదిమ్మరి కాడని పార్వతి ఆలోచన అట. మణికర్ణికా ఘాట్ యజమానే హరిశ్చంద్రు డిని కొని, హరిశ్చంద్ర ఘాట్‌లో కాటిపనికి నియమించాడు. మణి కర్ణికా ఘాట్, హరిశ్చంద్ర ఘాట్‌లలో అధికంగా దహన సంస్కారాలు జరుగు తుంటాయి. మణికర్ణికా ఘాట్‌కు మహాశ్మశానమని పేరుంది.





# SRI VENKATESWARA UNIVERSITY, TIRUPATI

(Accredited with `A+' Grade by the NAAC)

## DIRECTORATE OF DISTANCE EDUCATION

(Recognised by the UGC - Distance Education Bureau)

# ADMISSION NOTIFICATION FOR THE ACADEMIC SESSION JULY-2021

## POST GRADUATION:

**M.A:-** Telugu, English, Hindi, Economics, History. Political Science & Public Administration, Sociology, Master of Social Work,

**M.L.i.Sc., M.Sc.:-** Physics, Chemistry, Zoology. Botany, Psychology, Mathematics and Computer Science.

**M.Com., M.Com. (F.M.), M.B.A. (3 Years)**

## UNDER GRADUATION :

**B.A., B.Sc.,** (B.Z.C, M.P.C., M.S.Cs., M.P.E., M.E.Cs., M.PCs).,

**B.Com.**(General/Computer Applications) and B.L.I.Sc.

***P.G. DIPLOMA COURSES:*** 1. Industrial Relations & Personnel Management. 2. Guidance & Counselling

## OPEN UNIVERSITY SYSTEM (OUS):

Candidates without any formal education and completed Age of 18 years can persue B.A. and B.Com.Courses under OUS by qualifying in the eligibility entrance test.

**BACET-2021 Entrance Test will be held on 29.08.2021.**

**Last date for admissions: 31.08.2021**

For further details see website: www.svudde.in

Ph: 0877-2289380, Cell: 9177220642, 9705105270 Prof. S.V.SUBBA REDDY, Director

# భక్తజన మందారుడు

▪ డాక్టర్ పొత్తూరి వేంకటేశ్వరరావు

***శుభద్రమైన రేఖారూప ధ్వజము, అమృతక లశము, ఛత్రము, వజ్రము, అంకుశము, పద్మము, కల్పవృక్షము, శంఖము, చక్రము, ఆదిగాగల పరతత్వ చహ్రములచే అలంకృతుడైన శ్రీ వేంకటేశ్వర పాద పద్మములను శరణువేడుచున్నారు. చిన్మయానందుని జగన్మోహన విశ్వరూప సందర్శన మిది. చలాలు, అచలాలు అన్నీ ఈ పరమాత్ముని కరుణచేతనే ప్రస్తుత స్థితి నొంది ఉన్నాయి. సృష్ట లయ కారకులైన బ్రహ్మేతులు సైతం ఆయన సేవలో తరిస్తుండగా, ఇతరులు ఆ ముని మనోసంచారిని సంస్తుతిస్తూ ధ్యానం చేయడం ఏమాత్రం వింతకాదు. ఈ సకల చరాచర జగత్తు యావత్తును జగన్నాథుని సేవ కోసం సృష్టి చేశాడా బ్రహ్మ అనే సంభ్రమం, భక్తులై తరిస్తున్న దాసోత్తముల జీవితాలు ధన్యములైనవి. సకల భక్త జనావళికి ఆదర్శప్రాయమైనవి.***



నిరంతరం తన మూపుపై భగవానుని మోస్తూ జన్మ ధన్యం చేసుకుంటున్న గరుత్మంతుడు ఆ స్వామి దాసానుదాసుడు. సకల వేదాల స్వరూపుడాయన పరమాత్ముని ఆత్మ బంధువు. స్వర్గం నుంచి అమృత భాండాన్నే ఇంద్రుని ఎదిరించి భువికి తీసుకువచ్చి వీరుడు. తన తల్లి వినతి దాస్య విముక్తి కోసం ఆ సాహసం చేసినా, దుష్ట మనస్కులు, కద్రువ పుత్రులైన సర్పజాతికి అందకుండా విచక్షణను ప్రదర్శించి తిరిగి దాన్ని స్వర్గనికే చేర్చిన ధీశాలి. వైకుంఠం ఏడి శ్రీనివాసుడు తిరుమల చేరాడు. అది చూసిన గరుడు ఏడుకొండలనే అపర వైకుంఠంగా చేయాలని భావించి వైకుంఠంలోని క్రీడావాసినినే ఇక్కడికి కొనివచ్చాడని పురాణాలు చెబుతున్నాయి. అదే ప్రస్తుతం తిరుమలగిరుల్లోని స్వామి పుష్కరిణి, దివ్యలోకంలోని క్రీడాద్రి కూడా ఇక్కడికి తెచ్చి ప్రతిష్టంచిన భుజబలశాలి గరుత్మంతుడు. నమస్కార ముద్రతో నిలబడి నిరంతర సేవా భాగ్యుడయ్యాడు. శేషతల్పశాయి శ్రీనివాసుడు పాలకడలిలో శేష శయ్యపై ఆయన చిద్విలాసంగా పవళించి శ్రీసతితో సరస సల్లాపాలు ఆడుతూ వుంటారు. సర్పంకాల స్వభావానికి ప్రతీక. కాలస్వరూపుడు కమల భాంధవుడు, త్రిగుణాతీతుడైన పురుషోత్తముడు విషపూరితమై తమోగుణ సంపన్నమైన సర్పాన్ని పాన్పుగా చేసుకొని ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తున్నారు. శ్రీరామకృష్ణుల సంయుక్తావతారమే శ్రీ వేంకటేశ్వరుడు, రామరావణ యుద్ధ సమయములో రామలక్ష్మణు లను తన భుజస్కందాలపై మోసిన పరమ భక్తాగ్రేసరుడు హనుమంతుడు. అందుకే శ్రీవారి వాహన సేవలలో ఆయనకు సముచిత స్థానం లభించింది. భగవానుని లీలావిలాసాలను వర్ణించే శ్రీమద్భగవద్గీతలో గజేంద్రమోక్ష ఘట్టం భక్తిమార్గా న్ని ప్రబోధించే పరమ రమణీయకరమైనది. ప్రాణముల్ ఠావుల్ దప్పెను. ధైర్యము విలోలంబ య్యె... నీవే తప్పనిత: పరంబెరుగ' అంటూ భద్రాత్ముని సంరక్షింపమంటూ మకరంబారిన పడిన గజేంద్రుడు వేడుకుంటాడు. అహాన్ని విడిచి పరమాత్మునిపైనే భారం వేసి ప్రాణగండం నుంచి బయట పడుతాడు. శ్రీవారిని వైకుంఠం నుంచి పరుగు పరుగున రప్పించిన గజేంద్రుడు కూడా స్వామివారికి వాహనంగా తన ఉనికిని నిరూపించుకున్నాడు.

తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామికి పూర్వం నిర్వహించిన బ్రహ్మోత్సవాల్లో నిజమైన బంగారు, వెండి వాహనాల మీదే ఊరేగింపు జరిగేది. పగటి పూట జరిగే వాహన సేవలన్నీ బంగారు వాహనాల మీద, రాత్రి పూట జరిగే వేడుకలు వెండి వాహనాల మీద చేసేవారు. అయితే కాలానుగుణంగా వచ్చిన మార్పుల్లో ఈ వాహనాలు అనేక లోహాలతో తయా రు చేసి ఆ తరువాత బంగారు పూత పూయించేవిగా మారాయి. ఇప్పుడున్న స్వర్ణరథం సైతం ఇలాంటి పూత పూసిన రథమే. ఈ విధంగా తయారుచేసిన వాహనాలు కొన్ని దశాబ్దాల అనంతరం మరమ్మత్తు లకు వస్తున్నాయి. వీటి స్థానంలో కొత్తగా వాహనాలను తయారు చేయించడమో, లేదా భక్తులు కానుకగా ఇవ్వడమో జరుగుతోంది. పూర్వం నుంచి స్వామి వారికి ఉన్న వాహనాలు స్థానంలో అనేక సార్లు కొత్త వాహనాలు వచ్చాయి.

*(కొత్తపత్రిక జనవరి 2006 సౌజన్యంతో)*



# ఫితల్‌ఖోరాలో ధాన్యకటకం పేరు

■ 'పర్యాటక రత్న' మైనాస్వామి

*ఫితల్‌ఖోరా సముదాయంలో 14 గుహలున్నాయి. వాటిలో 5 చైత్యమందిరాలు, 9 విహారాలున్నాయి. 3వ గుహ ప్రధాన చైత్య మందిరం కాగా 4వ గుహ గొప్ప విహారంగా పేరు పొందింది. 9వ గుహలోని మందిరంలో బౌద్ధభిక్కులు నివసించడానికి వీలుగా 9 గదులున్నాయి. కొన్ని విహారాల్లో రాతి పరువులున్నాయి. గుహల్లోకి గాలి వెలుతురు బాగా రావడానికి ప్రత్యేకంగా కిటికీలను ఏర్పాటుచేశారు. కొన్ని గుహల్లో చుట్టూ గోడలకు ఆనుకొని పెద్దస్తంభాలను చెక్కారు. వరుసగా వున్న ఏనుగుల శిల్పాలు ఎంతో సుందరంగా వున్నాయి. ద్వారబంధాల కిరువైపులా కాపలా భటుల నిలువెత్తు శిల్పాలు కలవు. మనుషుల వస్త్రధారణ, తలపాగా సాంచి, అమరావతి శిల్పాలను పోలివున్నాయి. ఫితల్‌ఖోరా గుహల్లో అద్భుత శిల్పాలు - తైలవర్ణ చిత్రాలున్నాయి. గజలక్ష్మి, గంధర్వులు, యక్షులు - యక్షిణులు, కిన్నెరలు - కింపురుషులు తదితర శిల్పాలు అమరావతి శిల్పకళను ప్రతిబింబించే విధంగా వున్నాయి.*

*కాగా ఫితల్‌ఖోరా గుహల్లో 3 శాసనాలున్నాయి. అందులో 4వ గుహలోని శాసనం చాలా ముఖ్యమైనది. ఎందుకంత ప్రాముఖ్యం అంటే.. మన తెలుగువారి రాజధాని నగరం పేరుంది కాబట్టి. శాతవాహన రాజ్యరాజధాని, 'ధాన్యకటకం' పేరు 4వ గుహలోని స్తంభంపై వుంది. 'ధాన్యకటకంలోని సమస కొడుకు కన్హ ఆదేశంతో గుహల నిర్మాణం" చేపట్టినట్టు శాసనం చెబుతున్నది. శాసనం ప్రాకృతంలో వుండగా, లిపి బ్రాహ్మీ. శాసనం క్రీపూ. 2 లేదా 1వ శతాబ్దానికి చెందినది.*



పితల్‌ఖొరా స్తంభంలోని శాసనం

"ధేను కటకస సమస పుతనక న్హేనకట" అని స్తంభం మధ్యలో రాశారు. ధేనుకటకస.. అంటే ధాన్యకటకం. సమస అనే అతని కొడుకు కన్హ (క్రిష్ణ). కన్హ ఆదేశంతో ఫితల్‌ఖోరా గుహలను బౌద్ధ భిక్కుల కోసం నిర్మించారు. శాసనంలోని 'కన్హ' పేరు రాజుది అయితే అతనిని క్రిష్ణగా భావించవలసి వస్తుంది. శాతవాహనుల్లో తొలిరాజు శ్రీముఖుడు. అతనిని రెండవ సిముఖ, చిముక అని కూడా పేర్కొంటారు. శ్రీముఖుడు క్రీ.పూ. 2వ శతాబ్ధంలో శాతవాహన రాజ్యాన్ని 'ధాన్యకటకం' కేంద్రంగా పాలించాడు. వారిద్దరూ గొప్ప పరిపాలనను అందించారని చరిత్రకారులు రాశారు. తెలుగు రాజ్యంలో బౌద్ధధర్మ వ్యాప్తి కోసం వారు విశేషంగా పాటుపడ్డారు. తూర్పు దేశంలోని భట్టిప్రోలు (గుంటూరు జిల్లా) నుంచి పైథాన్ వరకు, ధాన్య కటకం నుంచి ఉజ్జయిని దాకా పలు వాణిజ్య రహదారులు అభివృద్ధి చేశారు. దారివెంబడి పలుచోట్ల గుహలను తొలిపించి బౌద్ధ విహార కేంద్రాలను ఏర్పాటు చేశారు. బౌద్ధధర్మం – సంస్కృతి వ్యాప్తిలో నాటి వాణిజ్య సంఘాలు కీలకంగా వ్యవహరించాయి.



ఫితల్‌ఖోరాలోని రెండంతస్తుల గుహలు

భారతదేశంలో తైలవర్ణ చిత్రాల చరిత్ర క్రీస్తు పూర్వం 2వ శతాబ్ధంలో మొదలయింది. అది కూడా తెలుగు పాలకుల ప్రోత్సాహంతోనే. మహారాష్ట్రలోని ఔరంగాబాద్ సమీపంలోని ఫితల్‌ఖోరా గుహల్లో తొలి నాళ్ళనాటి తైలవర్ణ చిత్రాలున్నాయి. ఫితల్‌ఖోరా కొండలను గుహలుగా తొలచి బౌద్ధ విహారాలుగా వినియోగించుకొన్నారు. ఆ గుహల్లోని స్తంభాలపై బుద్ధుని వర్ణ చిత్రాలున్నాయి. ఒక స్తంభంపై 'ధరణి కోట పాలకుల ఆదేశంతో విహారాలు నిర్మించి'నట్లు శాసనం వుంది. ఆ గుహలు అజంతా గుహలకంటే ముందువి. అజంతా అద్భుతాల ఆవిష్కరణకు మూలం శాతవాహనులే. అజంతాగుహల నిర్మాతలు ఆంధ్రులే. అజంతా గుహల్లోని అసామాన్య శిల్పాలు, తైలవర్ణ చిత్రాలు తెలుగు శిల్పులు – చిత్ర కారుల ప్రతిభకు, మేధాశక్తికి చక్కని తార్కాణాలు. శాత వాహన రాజులు వేదమతంతో పాటు బౌద్ధాన్ని విశేషంగా ఆదరించారు. ధరణికోట (నేటి గుంటూరు జిల్లా అమరావతి) కేంద్రంగా రాజ్యపాలన చేశారు. బౌద్ధ భిక్కుల కోసం అజంతా గుహలను శాతవాహనులు నిర్మింపచేశారు. గాంధార, మధుర, అమరావతి, సాంచి, కంచి శిల్పశాలలు తొలిరోజుల్లో ప్రఖ్యాతి గాంచాయి. అమరావతి శిల్పుల ఉలుల తాకిడికి ఉద్భవించినదే అజంతాగుహల సముదాయం. అజంతాలో మొత్తం 30 గుహలున్నాయి. అందులో అద్భుత శిల్ప సంపద వుంది. బుద్ధుని జీవిత ఘట్టాలు, బౌద్ధ జాతక కథలకు చెందిన శిల్పాలు, తైల వర్ణచిత్రాలు, చైత్య – స్తూప మందిరాలు, విహారాలు అజంతా గుహల్లో వున్నాయి. అజంతా



స్తంభంపై బుద్ధుని తైవవర్ణ చిత్రం

గుహలను క్రీస్తు పూర్వం 2వ శతాబ్దం నుంచి క్రీస్తు శకం 650 సంవత్సరం వరకు ఆంధ్ర రాజ వంశాల వారు తొలిపించి అద్భుతంగా తీర్చిదిద్దారు.

అప్పట్లో ఆంధ్ర ప్రాంతాన్ని అస్మక రాజ్యం అనేవారు. సముదాయంలోని 9,10 గుహల్లోని తైలవర్ణ చిత్రాలు ప్రపంచాన్ని నివ్వెర పరచేలా వున్నాయి. 9వ గుహ లోపలి గోడలన్నీ పూర్తిగా తైల వర్ణ చిత్రా లతో నిండిపోయాయి. స్తంభాలపై కూడా బొమ్మలు న్నాయి. బౌద్ధ జాతక కథలను ఎంతో గొప్పగా చిత్రించారు. 10వ గుహలో ఎడమవైపున శాతకర్ణి ముఖచిత్రం వుంది. ఆ ముఖచిత్రం గౌతమీపుత్ర శాతకర్ణిదని చారిత్రక పరిశోధకులు భావిస్తున్నారు. శాతవాహన చక్రవర్తుల్లో అగ్రగణ్యుడు గౌతమీపుత్ర శాతకర్ణి. భుజాల వరకు మాత్రమే వున్న ఆ వర్ణ చిత్రంలో తలపాగా లేదా వస్త్ర కిరీటం అద్భుతంగా చిత్రించారు. శాతకర్ణి ముఖంలో దయ, కరుణ కనిపించే విధంగా చిత్రంలో స్పష్టత వుంది. సామ మరియు ఛద్దాంత జాతక కథలను వివరించే వర్ణచిత్రాలు 10వ గుహలో వున్నాయి. 10వ గుహదాత 'వాశిష్టీపుత్ర, కటహది' అని క్రీ.పూ. 2వ శతాబ్ధం నాటి శాసనం తెలుపుతున్నది.

అజంతా 9,10 గుహల్లోని అద్భుత తైల వర్ణ చిత్రాలు క్రీస్తుపూర్వం 2వ శతాబ్దానికి చెందినవి. శాతవాహన తొలితరం రాజులు గుహలను తొలిపించి, శిల్పాలను మలిపించి గుహల గోడలను గొప్ప వర్ణ చిత్రాలతో నింపారు. గుహలు - శిల్పాలు -



అజంత - పద్మపాణి తైలవర్ణ చిత్రం

వర్ణచిత్రాలు... సంస్కృతి వందలాది సంవత్సరాలు కొనసాగింది. శిల్పులు - చిత్ర కారులు అచ్చమైన ఆంధ్రులు - అమరావతి వాసులే. అమరావతి శిల్పశాలలో విద్యను నేర్చుకొని ప్రపంచానికి తమ ప్రతిభను చాటారు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సాంచి బౌద్ధ స్తూపం తూర్పు ద్వారాన్ని గొప్పగా రూపొందించింది కూడా అమరావతి శిల్పులే.

*(రచయిత చారిత్రక పరిశోధకుడు)*

# శ్రీ ముఖలింగంలో మధుకేశ్వర స్వామి

▪ ఆర్.వి.యస్.రాజు

**గుడిలో ఒక చోట కూర్చుని చూస్తే గణపతి, సూర్యనారాయణ, అమ్మవారు, విష్ణుమూర్తి, శివుడు కనిపిస్తారు. అందుకే శ్రీముఖలింగంను పంచాయతన క్షేత్రమని అంటారు. మధుకేశ్వర దేవాలం శ్రీకాకుళం జిల్లాలో జలుమూరు మండలంలోని శ్రీముఖలింగం గ్రామంలో ఉంది. మధుకేశ్వర, భీమేశ్వకర, సోమేశ్వర ఆలయా లున్నాయి. ఇవి చక్కని శిల్పాలతో కనువిందు చేస్తాయి. శ్రీకాకుళం నుండి 46 కి.మీ. దూరంలో శ్రీముఖలింగం వుంది. వివిధ పాలకుల ఇక్కడ జైన, బౌద్ధ, హిందూమతాలు వర్ధిల్లాయి. ఇక్కడ దొరికిన ఏ శాసనంలోనూ వూరిపేరు ముఖలింగం అని పేర్కొనలేదు. నగరం, కళింగనగరం, కళింగదేశ నగరం, కళింగవాని నగరం, నగరపువాడు, త్రికళింగనగరం మొదలైన పేర్లతో శ్రీముఖలింగం వర్ధిల్లింది.**



'శ్రీముఖలింగం పేరులోనే చక్కని అర్థం ఉంది. శ్రీముఖలింగం అనే పదానికి పరమేశ్వరుడు లింగంలో కనిపించుట అని అర్థం ఈ దేవాలయం లోని శివలింగాన్ని ఏ దిశ నుంచి చూసినా మనవైపే చూస్తున్నట్టు వుంటుంది. గుడి గోపురం చాలా ఎత్తుగా వుంది. కాశీలో లింగం-గంగలో స్నానం, శ్రీశైలంలో శిఖరం, శ్రీముఖ లింగంలో ముఖ దర్శనం చేసుకొంటే మోక్షం సిద్ధిస్తుందని భక్తుల నమ్మకం, శ్రీముఖలింగేశ్వరుని ఆలయానికి పక్కనే ఆంజనేయస్వామి గుడి వుంది. భక్తులు శ్రీముఖలింగేశ్వరుని దర్శించుకొన్న తరువాత ఆంజనేయస్వామిని దర్శించు కోవడం ఆనవాయితి. శ్రీముఖలింగేశ్వరంలో మూడుచోట్ల ముక్కోణపు ఆకారంలో మూడు గుళ్ళున్నాయి. వాటిలో ప్రధానమైనది.. మధుకేశ్వర ఆలయం. దీనికి అభిముఖంగా కొంత దూరంలో భీమేశ్వరసన్నిధి వుంది. ఈరెండు ఆలయాలకు దూరంగా సోమేశ్వరగుడి ఉంది. మధుకేశ్వర గుడిలో ప్రతిష్ఠితమైన లింగాన్ని శ్రీముఖ లింగేశ్వరుడు అంటారు. మూడు ఆలయాల్లోను శిల్ప కళా సంపద చూపరులకు కనువిందు చేస్తుంది. ఈ ఆలయం తూర్పు గంగరాజుల శిల్పకళా వైభవానికి దర్పణం పడుతుంది. మూడు దేవాలయాలను క్రీ.శ.6-11 శతాబ్దాల మధ్యకాలంలో నిర్మించారు.

***స్థల పురాణం:*** ఒకప్పుడు హిమాలయాల మీద గొప్ప వైష్ణవయాగం జరిగింది. ఆ యాగాన్ని చూడడానికి గంధర్వరాజైన చిత్రగ్రీవుడు తన గణాలతో వచ్చాడు. హిమాలయాలమీద ఉండే శబరకాంతలు కూడా యాగం చూడడానికి వచ్చారు. శబరకాంతల సౌందర్యం చూసి గంధర్వులు కామ వశీభూతుల య్యారు. అది గమనించిన వామదేవ మహర్షి కోపగించి 'సభా మర్యాదను అతిక్రమించిన దోషానికి మీరంతా శబరజాతిలో జన్మించండి,' అని శపించాడు. గంధర్వులంతా శబరులుగా జన్మించారు. వారి నాయకుడైన చిత్రగ్రీవుడు శబర నాయకుడిగా జన్మించాడు. అతని రాణి చిత్తి, రెండవ భార్య చిత్కళ. ఈమె



శివభక్తురాలు. ఈ రాణులు కీచులాడు కొనేవారు. ఒకరోజు చిత్తి తనభర్తతో 'నీతో ఉంటే నేనైనా ఉండాలి లేదా చిత్కళైనా ఉండాలి' అని నిలదీసింది, శబర నాయకుడు పట్టపురాణి- చిత్తిని వదులుకోలేక తన రెండవరాణి చిత్కళను పిలిచి తన వాకిటిలో ఉన్న ఇప్పచెట్టునుండి రాలిన పువ్వులు ఏరుకొని వాటిని అమ్మి జీవనం సాగించమన్నాడు. చిత్కళ భర్తమాటకు ఎదురు చెప్పలేక ఇప్పచెట్టు పువ్వులు రోజు ఏరుకొనేది. అయితే ఆమె శివభక్తురాలు కనుక శివానుగ్రహం వల్ల రాలిన పువ్వులు బంగారు పువ్వులుగా మారిపోయేవి. చిత్కళ ఆ బంగారు పువ్వులను సుమంతపురంలో అమ్ముకొంటూ కాలం గడుపుతోంది. ఈ సంగతి తెలిసి చిత్తి అసూయ చెంది చిత్కళతో గొడవకు దిగింది. విసుగు చెందిన శబర నియకుబు సందుత గొడవకు ఇప్ప చెట్టే కారణమని తలచి ఆ ఇప్ప చెట్టును నరకడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు మహాశివుడు రౌద్రాకారంతో ఆ చెట్టు మొదట ప్రత్యక్షమయ్యాడు. అదిచూసి శబర నాయకుడు మూర్ఛబోయాడు. దీనికంతటికీ చిత్కళయే కారణమని తలచి శబరులంతా కలిసి చిత్కళను చంపడానికి సిద్ధపడ్డారు. అప్పుడు మహాశివుడు ప్రత్యక్షమై శబర రూపులైన ఆ గంధర్వులకు శాపవిముక్తి గావించాడు. ఆ విధంగా మధూక వృక్షంలో సాక్షాత్కరించిన మహాశివుడే మధుకేశ్వరుడుగా వెలశాడు.

***చరిత్ర:*** శ్రీముఖలింగంలో ఆలయాలు క్రీ.శ. 6-11 శతాబ్దాలలో నిర్మాణాలు జరిగినట్టు శాసనాల్లో ఉన్నాయి. ఆరవ శతాబ్దంలో ప్రధాన దేవాలయం మధుకేశ్వరుని, ఎనిమిదో శతాబ్దంలో సోమేశ్వర, 11వ శతాబ్దంలో భీమేశ్వర ఆలయాలు నిర్మించ




బద్దాయి. శిథిలమైన ఆలయాలను రెండువందల ఏళ్ల క్రితం పర్లాకిమిడి గజపతి వంశీయులు పునర్నిర్మించారు. మహాశివరాత్రి పర్వదినాన లింగోద్భవ కార్యక్రమాన్ని నేటికీ మహారాజ వంశీయులు నిర్వహిస్తారు. ఇక్కడ తవ్వకాలలో వీణాపాణి – సరస్వతి, వర్ధమాన మహావీరుని విగ్రహాలు లభించాయి. ఇక్కడ అనేక శాసనాలు వున్నాయి.

***మధుకేశ్వరాలయం:*** ముఖలింగాలయాన్ని, 'మధుకేశ్వరాలయం' అని అంటారు. ఇక్కడ లింగం రాతితో చెక్కింది కాదు. విప్ప చెట్టు మొదలే క్రమంగా లింగంగా మారిందని చెబుతారు. విప్ప చెట్టును సంస్కృతంలో మధుకం అంటారు. అందువల్ల ఈ గుడికి మధుకేశ్వరస్వామి దేవాలయంగా పేరు వచ్చింది.

***శిల్పకళ:*** ఈ ఆలయంలో గర్భగుడిలోగాకుండా ఎనిమిది వైపుల ఎనిమిది లింగాలున్నాయి. ఇక్కడి అమ్మవారు వారాహిదేవి. సప్తమాతృకలలో ఒకరు. మిగిలిన వారు బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, ఇంద్రాణి. వీరు పార్వతీదేవి అవతారాలు. శిల్పాలలో వరాహావతారం, వామనావతారం, సూర్య విగ్రహాలు వుండటం విశేషం. భీమేశ్వరాలయం శిథిలావస్థలో ఉంది. కుమారస్వామి, దక్షిణామూర్తి నాలుగు ముఖాలతో బ్రహ్మ, గణపతి విగ్రహాలున్నాయి. సోమేశ్వరాలయానికి గర్భగుడి మాత్రమే ఉంది. ముఖమండపం లేదు. ఎత్తయిన శిఖరంపై బ్రహ్మాండమైన రాతితో కప్పు వేశారు. ఇది ఒకే రాయి. బరువైన రాయిని అంత ఎత్తుకు ఆ రోజుల్లో ఎలా ఎత్తారో, ఎలా అమర్చారో తలచు కుంటే ఆ నాటి శిల్పుల గొప్పదనం తెలుస్తుంది. ఏడు నాలుకల అగ్ని విగ్రహం, వినాయకుడు, కాశీ అన్నపూర్ణ, నటరాజు, కుమారస్వామి హరిహర దేవుల విగ్రహాలు ఎంతో అందంగా ఉన్నాయి. ఆలయం శిథిలావస్థలో ఉంది. ఆలయ ప్రాంగణం లో శిల్ప సంపద చూపరులను ఆకట్టుకొంటుంది. అరుణాచలంలోని శిల్ప సంపదను తలపించే విధంగా ఆలయంలో పార్వతీ పరమేశ్వరుల శిల్పాలు కనిపిస్తాయి. శివపార్వతులు ఎరుపురంగు రాతిపై ఉత్తర ముఖంగా ఉండడం విశేషం. గర్భగుడిలో ఒకచోట



కూర్చుని చూస్తే గణపతి, సూర్యనారాయణ, అమ్మవారు, విష్ణుమూర్తి, శివుడు కనిపిస్తారు. అందుకే దీనిని పంచాయతన క్షేత్రమని అంటారు. శ్రీముఖ లింగంలో అష్టగణపతులు న్నారు. వ్యాసమహర్షి వ్యాసగణపతిని ప్రతిష్ఠించాడు. దీనితో పాటు శక్తి గణపతి, చింతామణి గణపతి, దుండి గణపతి, సిద్ధి-బుద్ధి గణపతి, తాండవ సాక్షి గణపతులు దర్శనం ఇస్తారు.







ఆలయ దర్శనం

# నెల్లూరులో కొలువుదీరిన శ్రీరంగనాథుడు

■ రాయపాళ్యం కాళేశ్వర రావు





*తల్పగిరి శ్రీరంగనాథస్వామి ఆలయం ప్రాచీనమైనది. నెల్లూరులోని రంగనాయకుల పేటలో పెన్నానది ఒడ్డున ఉంది. శ్రీరంగనాథస్వామిని విష్ణువు - రంగనాయిక అమ్మవారిని లక్ష్మీదేవి ప్రతిరూపంగా భావిస్తారు. తల్పగిరి శ్రీరంగనాథస్వామి గుడి మూడు రంగనాథస్వామి దేవాలయాల్లో ఒకటి. మిగిలినవి శ్రీరంగం, శ్రీరంగపట్టణం. గర్భాలయంలో శేషతల్పంపై శయనముద్రలో శ్రీరంగనాథుడు నయన మనోహరంగా దర్శనమిస్తాడు. స్వామి పాదాల వద్ద శ్రీదేవి-భూదేవి కనిపిస్తారు. అద్దాల మండపంలో చిత్రించిన శ్రీకృష్ణుని తైల వర్ణచిత్రం భక్తులు ఎటువైపు నిలబడినా వాళ్లవైపే చూస్తున్నట్లుగా మనల్ని మంత్ర ముగ్ధులను చేస్తుంది. తూర్పున ఏడు అంతస్థుల రాజగోపురం కలదు. సుమారు 95 అడుగుల ఎత్తు ఉంటుంది. గోపురం పై భాగాన బంగారుపూత పూసిన ఏడు కలశాలు వున్నాయి.*

ఆదిశేషువు శ్రీమహా విష్ణువు ఆనతి మేరకు భూలోకంలో పెన్నా నదీ తీరంలో గిరిగా నిలవగా, స్వామి విశ్రాంతి తీసుకొంటున్న కారణంగా 'తల్పగిరి' అన్న పేరు వచ్చినట్లుగా తెలుస్తున్నది. ఏడో శతాబ్ద కాలంలో ఈ ప్రాంతాన్ని పాలించిన పల్లవ రాజులు తొలి ఆలయాన్ని నిర్మించారు. 12వ శతాబ్దంలో చోళుల పాలనలో పునః నిర్మాణాలు జరిగాయి.

**స్థలపురాణం:**

మహాపుణ్యక్షేత్రాల పర్యటనలో భాగంగా నెల్లూరు వచ్చిన కశ్యప ముని ఇక్కడ పౌండరీక యాగం నిర్వహిం చాడు. అతని భక్తికి మెచ్చి నారాయణుడు ఆ ప్రాంతం భక్తుల ఆదరణతో పరిఢవిల్లుతుందని అక్క డ శ్రీరంగనాథ స్వామిగా వెలిశాడు. మరో కథనం ప్రకారం కశ్యప మహర్షి యజ్ఞంలో నుంచి ఉద్భవించిన త్రేతాగ్ని జ్వాలల్లో శ్రీరంగనాథస్వామి గుడి జొన్నవాడ కామాక్షమ్మ కోసల, వేదగిరి నరసింహస్వామి క్షేత్రంగా వెలసినట్లు స్కంద పురాణం, వైష్ణవ సంహితలో పేర్కొన్నారు.



ప్రసిద్ధి చెందిన రంగనాథ స్వామి దేవాల యాల్లో శ్రీతల్పగిరి రంగనాథస్వామి ఆలయం ఒకటి. విశాలమైన ఆలయ ప్రాంగణా నికి తూర్పున ఏడు అంతస్థుల రాజగోపురం కలదు. సుమారు 95 అడుగుల ఎత్తు కలదు. గోపురం పైభాగాన బంగారు పూత పూసిన 7 కలశాలున్నాయి. ప్రధానాలయం పశ్చిమాభిము ఖంగా వుంది. పశ్చిమాన పెన్నానది ప్రవహిస్తున్న ది. దీనిని పినాకినీ నది అని కూడా పిలుస్తారు.

భక్తులు నదీ స్నానం ఆచరించి దైవ దర్శనానికి వెళతారు. ప్రధానాలయం ప్రవేశం దక్షిణద్వారం నుంచి జరుగుతుంది. ముఖ మండపం, అంతరాళం, గర్భాలయం వున్నాయి. గర్భాలయంలో





శేషతల్పంపై శయనముద్రలో శ్రీరంగనాథుడు నయన మనోహరంగా దర్శనమిస్తాడు. స్వామి పాదాల వద్ద శ్రీదేవి-భూదేవి వున్నారు. గర్భాలయం చుట్టూ ప్రదక్షిణ చేయడానికి వీలుగా మండపం నిర్మించారు. ప్రదక్షిణ మండపంలో ఉత్తర భాగంలో శ్రీరంగ నాథుని పాదాలు, శ్రీ అనంత పద్మనాభ స్వామిని చూడవచ్చు. మహాకవి తిక్కన ఈ దేవాలయంలోనే మహాభారతాన్ని తెలుగులోకి అనువదించాడు.

12వ శతాబ్దానికి చెందిన ఈ దేవాలయం మొదట శ్రీ వైకుంఠంగా పిలవబడేది. 17వ శతాబ్దం తరువాత ఈ దేవాలయం శ్రీ తల్పగిరి శ్రీరంగనాథస్వామి ఆలయంగా ప్రసిద్ధి చెందింది. క్రీ.శ. 7,8 శతాబ్దాల్లో సింహపురి నేలిన పల్లవ రాజులు ఈ ఆలయాన్ని నిర్మించారు. రాజరాజ నరేంద్రుడు, కుళోత్తుంగ చోళుడు గోదావరి, కావేరీ నదుల మధ్యభాగాన్ని పరిపాలించే సమయంలో ఈ ఆలయ గర్భగృహ, ప్రాకారాదులను నిర్మింపచేశారు. క్రీ.శ.1879లో యెరగడిపాటి వెంకటాచలం పంతులు గుడి తూర్పు రాజగోపురాన్ని నిర్మింపచేశారు. సుమారు 100 సంవత్సరాలకు పూర్వం శ్రీమాన్ ముప్పిరాల నరసింహాచార్యుల వారు శ్రీ స్వామివారికి బంగారు తాపడం చేసిన గరుడ వాహనాన్ని అద్దాల మండపాన్ని బహూకరించారు.






ఈ గోపురంపై అనేక దేవతా విగ్రహాలను అందంగా తీర్చి దిద్దారు. అద్దాల మండపం భక్తులను విశేషంగా ఆకర్షిస్తుంది. అద్దాల మండపంలో చిత్రించిన శ్రీకృష్ణుని తైలవర్ణ చిత్రం భక్తులను విశేషంగా ఆకర్షిస్తున్నది. మనం ఎటువైపు నిలబడి చూసినా మనవైపే చూస్తున్న ట్లుగా మనల్ని మంత్ర ముగ్దులను చేస్తుంది. గర్భగుడిలోకి ప్రవేశించే ఉత్తర ద్వారాన్ని ముక్కోటి ఏకాదశి నాడు మాత్రమే తెరచి వుంచుతారు. శ్రీ తల్పగిరి రంగనాథ స్వామికి ప్రతి సంవత్సరం మార్చి లేదా ఏప్రిల్‌లో బ్రహ్మోత్సవాలు జరుపుతారు.

శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా యొక్క ముఖ్య పట్టణం. నెల్లూరుకు విక్రమసింహపురి అనే పేరు కూడా ఉంది. విక్రమసింహ మహావీర, మనుమసిద్ధి మహారాజు సింహపురి రాజధానిగా నెల్లూరు ప్రాంతాన్ని పరిపాలించాడు. మనుమసిద్ధి కాలంలో ఈ ప్రాంతం సస్యశ్యామలమై అత్యధిక వరి ధాన్యపు ఉత్పత్తితో విలసిల్లేది. అందుకే ఈ ప్రాంతానికి నెల్లి (తమిళభాషలో వరి అని అర్థం) నెల్లివూరు అనే పేరు వచ్చింది. కాలక్రమంలో నెల్లివూరు నెల్లూరుగా మారింది.

*(**ఆలయ దర్శన వేళలు:** ఉదయం 6.30 నుంచి 12 గంటల వరకు. సాయంత్రం 4.30 నుంచి రాత్రి 8 గంటలు వరకు).*

# ఆ కొండల్లో బౌద్ధం ముద్రలు



*ఆంధ్ర దేశంలో ప్రముఖ నగరమైన విశాఖపట్నం పరిసరాల్లో ప్రఖ్యాత బౌద్ధ స్థూపాలు, ఆరామాలు వున్నాయి. సుమారు 2 వేల సంవత్సరాల కిందట విశాఖ ప్రాంతంలో బౌద్ధం ఎంతగానో విలసిల్లింది. విశాఖ అప్పట్లో వర్తక వాణిజ్యాలకు కేంద్రంగా వుండేది. విశాఖ పరిసరాల్లోని బౌద్ధ ప్రదేశాల్లో విదేశీ నాణాలు దొరకడం అందుకు నిదర్శనం. బావికొండ, తొట్లకొండ, పావురాళ్ళ కొండ, బొజ్జనకొండలలోని బౌద్ధ ప్రదేశాలు బౌద్ధ ధర్మ వ్యాప్తిలో ప్రముఖ పాత్ర పోషించాయి. శంకరం సమీపంలోని బొజ్జన కొండపై రాతిలో తొలచిన ఎన్నో చిన్న స్థూపాలున్నాయి. రాతి గుహలో మలిచిన ధ్యాన బుద్ధుని శిల్పం, స్థూపం ఎంతో ఆకర్షణీయంగా వున్నాయి. బౌద్ధం విదేశాలకు వ్యాపించడంలో విశాఖ ప్రాంతం ఒకప్పుడు చాలా కీలకంగా వ్యవహరించింది.*



***బావికొండ :*** బావికొండ బౌద్ధసముదాయం విశాఖపట్నంకు 16 కిలోమీటర్ల దూరంలో, సముద్ర మట్టానికి 390 అడుగుల ఎత్తుగల కొండపై వుంది. కొండపై వర్షపు నీరు సేకరించి

నిల్వచేసుకోవటానికి అనేక బావులుం డటంతో బావికొండ అని పేరు వచ్చింది. బావి కొండ బౌద్ధరామం క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందినది. బావి కొండ, ఆంధ్రప్రదేశ్ బౌద్ధమత క్షేత్రాల్లో బుద్ధుని ధాతవులు దొరికిన ముఖ్య క్షేత్రం. ఇక్కడ జరిగిన తవ్వకాలలో ఒక పెద్ద బౌద్ధ సముదా యం బయల్పడింది. ఒక మట్టి కలశంలో ఒక ఎముక ముక్క కూడా దొరికింది. శాసనాలు, మట్టి పాత్రలు, ఫలకాలు, ఇటుకలు, నాణేలను రాష్ట్ర పురాతత్వశాఖ వారు సేకరించా రు. బావికొండకు సమీపంలో మరో రెండు బౌద్ధ సముదాయాలు న్నాయి. అవి తొట్లకొండ మరియు పావురాల కొండ.

***తొట్లకొండ :*** తొట్లకొండ బౌద్ధ సముదాయం విశాఖపట్నం నుండి 15 కి.మీ. దూరంలో భీమిలి వెళ్ళేదారిలో 385 అడుగుల ఎత్తున్న కొండపై వుంది. కొండపై వర్షపు నీటిని సేక రించడానికి రాతితో తొలచిన అనేక తొట్లు వున్నాయి. దానితో తొట్లకొండ అని పేరు వచ్చింది. తొట్లకొండ ప్రాచీన కళింగ ప్రాంత ప్రభావంలో వుండి ఇక్కడి నుండి బౌద్ధ సంస్కృతి శ్రీలంక మరియు తదితర ఆగ్నేయాసియా దేశాలలో వ్యాపించేందుకు ప్రధాన కేంద్రంగా దోహద పడింది.

***పావురాలకొండ :*** పావురాలకొండ విశాఖకు 25 కి.మీ. దూరంలో వుంది. నరసింహ స్వామి కొండ గా ప్రసిద్ధమైనది. ఈ కొండ 450 అడుగుల ఎత్తులో వుంది. పావురాలకొండలో బౌద్ధ విహారం యొక్క శిథిలాలు వున్నాయి. ఇక్కడ క్రీ.పూ. 3వ శతాబ్దం నుండి క్రీ.శ. 2వ శతాబ్దం వరకు జనావాసాలు వుండి వుండవచ్చని అంచ నా. ఉత్తర తీరాంధ్రలోని అతి పెద్ద బౌద్ధ విహార క్షేత్రాల్లో ఇది ఒకటి. ఈ కొండపై హీనయాన బౌద్ధం వర్ధిల్లింది. తవ్వకాల్లో అనేక అవశేషాలు లభ్యమయ్యాయి. రెండు బ్రాహ్మీలిపి శాసనాలు, విహారాల యొక్క పునాదులు, వృత్తాకార చైత్యాలు, మొక్కుబడి



స్తూపాలు, భవానల ఆనవాళ్ళు తదిత రాలు ఈ శిధి ల్లాల్లో వున్నాయి. పురావస్తు శాఖ వారు ఈ ప్రదేశం నుండి నాణేలు, మెరుగుబెట్టిన పాత్రలు, పూసలు మొదలైన వస్తువులను సేకరిం చారు. ఈ కొండపై వర్షపు నీటిని నిలువచేసుకో వటానికి రాతిలో చెక్కిన దాదాపు పదహారు తొట్లను కనుగొన్నారు. ఇలాంటి తొట్ల వల్లేపేరు సంతరించు కొన్న బావికొండ, తొట్లకొండల కంటే ఎక్కువ తొట్లు ఇక్కడే ఉండటం విశేషం. ఈ కొండకు సమీపంలో గోస్తనీ నది ప్రవహిస్తున్నది. ఇక్కడి నుండి సముద్రతీరం యొక్క దృశ్యం కనిపిస్తుంది. విశాఖ పట్నం జిల్లాలోని ఇతర బౌద్ధ క్షేత్రాలైన బావికొండ మరియు తొట్లకొండలకు పావురాళ్ళ కొండ క్షేత్రం



శంకరంలోని బౌద్ధ స్తూపం



పావురాల కొండ

కూడా సమకాలీనమైనది. బౌద్ధం విహారం మరియు వరండా 2012లో జరిగిన తవ్వకాల్లో బయల్పడ్డాయి. బౌద్ధ క్షేత్రాల లో తరచుగా కనిపించే అర్థ చంద్రాకారపు శిలలు విహారాలలో అడుగుపెట్టే స్థలంలో స్వాగతం పలుకుతున్నాయి. ఒక నాగ శిల్పం, ధాన్యం నిలువచేసుకోవడానికి ఉపయోగిం చిన ఒక పెద్ద కుండ, చిన్న కుండ, శిలాస్తంభాల మండపాలు, అవశేషపు భోషాణము మరియు ఒక రోమన్ నాణెం, రెండు శాతవాహన నాణేలు, పుష్ప లకాలు దొరికాయి. తీరానికి దగ్గర ఉండటం వల్ల ఇక్కడ దేశంలోని వివిధ ప్రాంతాలతోనే కాక విదేశాలతో కూడా వర్తక సంబంధాలు ఉండేవని తెలుస్తున్నది.

బౌద్ధక్షేత్ర నిర్మాణంలో ఉపయోగిం చిన కొన్ని ఇటుకలు డచ్ అతిథిగృహం నిర్మాణంలో ఉపయో గించినట్టు తెలుస్తున్నది. పావురాల కొండలో ఇప్పటి వరకు నాలుగు శాసనాలు లభించాయి. అందులో ఒకటి క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందినది. మిగిలిన మూడు శాసనాలు క్రీ.శ. ఒకటి నుండి రెండవ శతాబ్దానికి చెందినవి. చివరి మూడింట్లో ఒకటి పాల అనే గ్రామవాసులు బౌద్ధ ఆరామానికి ఛత్రం, తొట్టి, మండపం దానం చేసిన విషయం తెలుపుతున్నది. మిగిలినవి అనేక బౌద్ధ సన్యాసుల పేర్లు పేర్కొంటున్నా యి.

***శంకరం :*** విశాఖ జిల్లా శంకరం గ్రామం దగ్గర కొండలపై బౌద్ధ స్థలాలు బొజ్జన్న కొండ మరియు లింగాల కొండ. ఇవి విశాఖ పట్నంకు 30 కి.మీ. దూరంలో కలవు. ఈ స్థలాలు క్రీ.శ. 4 నుండి 9 శతాబ్ది మధ్యవిగా నమ్ముతారు. ఒకనాడు



శంకరం

సంఘారం (సంఘారామము) అని పిలవబడేది. మూడు రకాల బౌద్ధ మత వర్గాలు హీనయానం, మహా యానం, వజ్రయానం, బాగా వృద్ధిలో వుండేవి.

ఏకశిలా స్తూపాలు, కొండలో తొలచబడిన గుహలు ప్రత్యేక తలు. నాలుగు గుహలు ఆశ్రయ స్థలాలు. మూడింటిలో ధ్యాన బుద్ధ విగ్రహాలు న్నాయి. ప్రతి గుహ ద్వారము రెండు ప్రక్కల పెద్ద ద్వారపాలకుల విగ్రహాలున్నాయి. గుహ అంతర్భాగము చతుర్భుజాకారంలో వుండి పదహా రు స్థంభాలతో, 20 గదులతో తొలచబడింది. గుహ మధ్యలో చతురస్రాకారపు తిన్నెపై రాతితో తొలచబడిన ఘన స్తూపము వుంది. ధ్యాన ముద్రలో గల బుద్ధుని విగ్రహం అద్భుతంగా వుంది. బొజ్జన్న కొండలోని బుద్ధుని శిల్పం, ప్రధాన స్తూపము రాతిలో తొలచబడింది. బొజ్జన్న కొండపై ఇటుకలతో కట్టబడిన విహారాలు, చైత్యము, భిక్షువుల గదులు వున్నాయి. 4వ శతాబ్దపు సముద్ర గుప్తుని నాణెము, చాళుక్య రాజు కుబ్జ విష్ణువర్ధనుని, ఆంధ్ర శాతవాహనుల కాలంనాటి నాణేలు ఇక్కడ గతంలో దొరికాయి. లింగాలకొండ అంచున రాతిలో తొలచబడిన పలు స్తూపాలున్నాయి. విశాఖ ప్రాంతంలో పలు బౌద్ధ ప్రదేశాలున్నాయి. వాటిని అద్భుత పర్యాటక కేంద్రాలుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వం పైవుంది.



తొట్లకొండ



# అచ్యుత రాయల బురుజు

▪ మైలారం మంజునాథ్



***ఆంధ్ర రాష్ట్ర తొలి రాజధాని కర్నూలు.పూర్వపు పేరు కందన వోలు. విజయనగర సామ్రాజ్యంలో ప్రముఖ కోట. కందనవోలు కోటకు నాలుగువైపులా గల బురుజులలో నగరం నడిబొడ్డులో వున్నది ముఖ్యమైనది. కోట రక్షణలో భాగంగా బురుజులను కట్టి-వాటిపై కాపలాకాసేవారు. నడిబొడ్డులోనిది కొండారెడ్డి బురుజుగా ఖ్యాతి గాంచింది. వాస్తవానికి ఆ బురుజు విజయనగర ప్రభువు అచ్యుత దేవ రాయల కాలంలో నిర్మితమయింది. కొండారెడ్డి బురుజు చరిత్ర గూర్చి ఎటువంటి శాసనాలు లభ్యంకాలేదు. తుళువ నరస నాయకుని పెద్ద కుమారుడు వీర నరసింహరాయలు (క్రీ.శ.1505-1509) కందనవోలు కోటను అరవీడు రామరాజుకు బహూకరించినట్లు తెలుస్తున్నది. సుల్తానుల దాడిని సమర్థవంతంగా తిప్పికొట్టిన దుర్గాధిపతి అరవీటి రామ రాయలకు వీర నరసింహ రాయలు కందనవోలు కోటను ఇచ్చాడు. అయితే కోట పటిష్టం-బురుజుల నిర్మాణం మాత్రం అచ్యుత దేవ రాయల కాలం(క్రీ.శ.1529-1542) లో జరిగింది. అది అచ్యుత రాయల బురుజే.***

***బురుజు మొత్తం నాలుగు భాగాలుగా ఉంది. క్రింది భాగంలో తూర్పువైపు కాపలాదారు ఉండటానికి ఒక చిన్న గది, ఆగ్నేయంవైపు మొదటి అంతస్థుకు చేరుకోవడానికి వీలుగా విశాలమైన మెట్లున్నాయి. మధ్య లో నాలుగు స్థంబాలు న్నాయి. మొదటి అంతస్తులో కుడి,ఎడమలవైపు గుంపుగా కాకుండా ఒక్కొక్కరు చొప్పున వరుసగా ఎక్కడానికి ఇరుకైన మెట్లున్నాయి. అంటే శత్రువులెవరైనా దాడి చేసినపుడు ఒక్కసారిగా పైకి రాకుండా ఇవి అడ్డు పడతాయి. ఆ పై భాగంలో సైనికులు ఉండటానికి ఐదు పెద్ద పెద్ద గదులు, ఖైదీలను బంధించడానికి రెండు చిన్న గదులున్నాయి.***

శ్రీక్రిష్ణదేవరాయల కన్నా ముందు క్రీ.శ. 1505–1509 మధ్య విజయనగరం సామ్రాజ్యాన్ని పరిపాలించిన తుళువ వీర నరసింహరాయలు కందనవోలు కోటను అరవీడు రామరాజుకు బహూకరించినట్లు తెలుస్తూంది. "కందనవోలు" కోట గురించి మొట్ట మొదట కనపడేది ఇక్కడే. బీజాపూర్ సుల్తాను యూసఫ్ ఆదిల్ ఖాన్ తుంగభద్రానదిని దాటుకొని కందనవోలు కోటపై దండెత్తాడు. ఆ సమయంలో తుళువవీర నర సింహునికి అండగా అరవీడు రామరాజు నిలబడి బీజాపూర్ సుల్తానును పారద్రోలి కందనవోలు కోటతో పాటు ఆదోనిని కూడా ఆక్ర మించడానికి సహాయపడ్డాడు. దానితో విజయనగర ప్రభువైన వీర నరసింహుడు రామ రాజును మెచ్చు కొని కందనవోలు కోటను అతనికి బహు మానంగా ఇచ్చాడు. అతడే కర్నూలు కోటను పటిష్టం చేసి బురుజును నిర్మించి ఉండవచ్చని కొందరి అభిప్రాయం.

***శ్రీక్రిష్ణదేవరాయలు సోదరుడైన అచ్యుత దేవరాయల కాలంలో కందనవోలు కోటను కట్టించినట్టు భారత పురావస్తు శాఖ వారు ఏర్పాటు చేసిన శిలాఫలకంలో పేర్కొనడం జరిగింది. కొండా రెడ్డి బురుజును నిర్మించినది కూడా అతనేనని దీని అసలు పేరు అచ్యుత దేవరాయల బురుజు అని పేర్కొన్నారు.***

ఏదేమైనా ఈ కొండారెడ్డి బురుజు విజయనగర సామ్రాజ్య కాలంలో నిర్మించబడిందనడంలో సందేహం లేదు. మనం ఎస్.పి. కార్యాలయానికి కొండారెడ్డి బురుజు పక్కనుండి వెళ్ళే గేటు దగ్గర నిలబడి ఆ బురుజు కోటను గనక గమనిస్తే పైన చిన్న చిన్న రంధ్రాలున్న ప్రదేశాల దగ్గర విజయనగర రాజులకు సంబంధిం చిన సింహం, ఏనుగు, గుర్రం లాంటి చిన్న చిన్న బొమ్మలు కనబడుతాయి.


అచ్యుత రాయలు

కందనవోలు కోట మొత్తం మూడు చదరపు కిలో మీటర్లు





వైశాల్యంతో, ఆరు అడుగుల ఎత్తుతో శత్రువుల నుండే కాక, తుంగభద్ర, హంద్రి నదుల వరదల నుండి కాపాడే టట్లు నిర్మించారు. ఈ కోట చుట్టు ఒక కందకం ఉండేది. నగర విస్తరణలో భాగంగా బ్రిటీష్ కాలంలో ఈ కోట గోడల్ని తొలగించారు. తుంగభద్ర వైపు ఇప్పటికీ తీరం వెంట ఎత్తయిన కోట గోడను గమనించవచ్చు. క్రీ.శ. 1602–1618 మధ్య కాలంలో బీజాపూర్ సుల్తాను ప్రతినిధి అయిన అబ్దుల్ వహబ్ కందనవోలును పరిపాలిస్తూ ఉండేవాడు. ఆ సమయంలో నందికొట్కూరు తాలూకా పాతకోట పాలెగాడైన కొండారెడ్డి ఇతని అధికా రాన్ని ధిక్కరించడంతో అబ్దుల్ వహబ్ కొండా రెడ్డిని ఓడించి ఈ బురుజులోని కారాగారంలో బంధించా డు. ఆ కొండారెడ్డి బురుజులోనే మరణిం చడంతో అతని పేరుమీద దీనికి కొండారెడ్డి బురుజు అనే పేరు వచ్చి ఉంటుందని పలువురి అభిప్రాయం. మరికొందరి అభిప్రాయం ప్రకారం ఆంగ్లేయుల పాలనా కాలంలో అలంపూర్ ప్రాంతంలోని కొండారెడ్డి అనే దేశభక్తుడు వాళ్ల అధికారాన్ని ఎదిరించడంతో ఆంగ్లేయులు అతనిని పట్టుకొని ఇక్కడ బంధించారనీ, దానితో అతని పేరు మీద దీనికి "కొండారెడ్డి బురుజు అనే పేరు వచ్చిందని చెబుతారు.



అలాగే మరికొందరు కల్లూరు ప్రాంతానికి చెందిన కొండారెడ్డి అనే అతని పేరు మీద కూడా దీనికి ఆ పేరు వచ్చిందంటారు. నందికొట్కూరు పాలెగాడైన కొండారెడ్డి మరణించడం వల్ల ఈ పేరు వచ్చిందని అత్యధికుల విశ్వాసం. 1930 జనవరిలో భారతి పత్రికలో కర్నూలు జిల్లా గురించి పరిశోధనాత్మక వ్యాసాన్ని గన్నవరపు సుబ్బరామయ్య ప్రచురించారు. అందులో అనేక కట్టడాల ఫోటోలు వాటి పేర్లు ఇచ్చారు. కొండారెడ్డి బురుజు ఫోటో క్రింద మాత్రం ఎటువంటి పేరు ఇవ్వకుండా "ఇది ఒక పాత బురుజు, ఇందులో నల్లమందును దాచి పోలీసులు కాపలా కాస్తున్నారు" అని రాసారు. అలాగే దాదాపు 40 సంవత్సరాలు కర్నూలు ప్రాంతంలో నివసించిన విలియం ఆర్థర్ స్టాంటస్ 1950లో అమెరికాలో ప్రచురించిన 'ది అవేకనింగ్ ఆఫ్ ఇండియా' అనే పుస్తకంలో కూడా కొండారెడ్డి బురుజు చిత్రం క్రింద 'బాస్టియస్ టు ద ఓల్డ్ ఫోర్ట్' అని రాసారే గానీ కొండారెడ్డి బురుజు అని రాయలేదు. వీటిని పరిశీలించిన కొందరు అసలు 1950కి ముందు కొండారెడ్డి బురుజు అనే పేరు ఉందా? లేదా? ఉంటే వారెవరూ పుస్తకాలలో దానినెందుకు పేర్కొనలేదు? అని అభిప్రాయపడుతున్నారు.

దీని నిర్మాణాన్ని పరిశీలిస్తే దీనిని కర్నూలు నగరానికి దగ్గరలో ఉన్నటువంటి జగన్నాథగట్టు నుండి రాళ్లను తీసుకొని వచ్చి ఒకదాని మీద ఒకటి పేరుస్తూ ఇసుక, సున్నం, బెల్లం మిశ్రమంతో కట్టారు. తూర్పువైపు కాపలాదారు ఉండటానికి ఒక చిన్న గది, ఆగ్నేయంవైపు మొదటి అంతస్తుకు చేరుకోవడానికి వీలుగా విశాలమైన మెట్లు ఉన్నాయి. మధ్య భాగంలో నాలుగు స్థంబాలు ఉన్నాయి. వీటిని నవాబుల కాలంలో బురుజు పడిపోకుండా నిర్మించినట్లు చెబుతారు. మొదటి అంతస్తులో కుడి, ఎడమవైపు గుంపుగా కాకుండా ఒక్కొక్కరు చొప్పున వరుసగా ఎక్కడానికి ఇరుకైన మెట్లు ఉన్నాయి. అంటే శత్రువులెవరైనా దాడి చేసినప్పుడు ఒక్కసారిగా పైకి రాకుండా ఇవి అడ్డు పడతాయి. ఆ పై భాగంలో సైనికులు ఉండటానికి ఐదు పెద్ద పెద్ద గదులు, ఖైదీలను బంధించడానికి రెండు చిన్న గదులు ఉన్నాయి.

అదే విధంగా మధ్యలో అవసరం పడినప్పుడు తప్పించుకోవడానికి వీలుగా ఒక సొరంగ మార్గం కూడా ఉంది. ఈ సొరంగ మార్గం అలంపురం వరకు ఉందని కొందరి అభిప్రాయం. నిజానికి తుంగభద్ర నది క్రింద నుండి సొరంగ మార్గం నిర్మించడం అప్పట్లో అసాధ్యం. కాబట్టి ఈ సొరంగ మార్గం కోట బయట తుంగభద్రానది ఒడ్డువరకు ఉండవచ్చు. శత్రువుల నుంచి తప్పించుకోవలసిన సందర్భాలలో ఈ సొరంగ మార్గం ద్వారా వాళ్ళు అక్కడి వరకు వెళ్ళి అలాగే తుంగభద్రానదిని దాటి వెళ్ళిపోవచ్చు. రెండవ అంతస్తు అర్థ వలయాకారంలో చిన్న మార్గంలో ఉంటుంది. ఇందులో పడమరవైపు సైనికుల కోసం నిర్మించిన ఏడు గదులున్నాయి. వాటికి ఎదురుగా శత్రువులను ఎదుర్కోవడానికి వీలుగా చిన్న చిన్న రంధ్రాలు గల మనిషి పట్టేంత నిర్మాణాలున్నాయి. ఈ రంధ్రాల ద్వారా సైనికులు అవతల వారికి కనబడకుండా తమని తాము రక్షించుకుంటూ, కోటపైకి వచ్చినటువంటి శత్రువులపై దాడి చేయడానికి వీలవుతుంది. ఇక్కడి నుండి తుపాకుల ద్వారా క్రిందివారిని కాల్చవచ్చు. అంతేకాకుండా కోటపైకి ఎగబాకుతున్న వాళ్ళకు పైనుంచి రాళ్ళు గానీ, వేడి వేడి పదార్థాలుకానీ గుమ్మరించడానికి వీలుగా ఉంటుంది. మూడవ అంతస్థులో ఇటుకలతో నిర్మించిన 7సైనిక గదులు వాటి ముందు విశాలమైన స్థలం ఉన్నాయి. స్థలం మధ్యలో 168అడుగుల ఎత్తు గల పొడవైన స్తూపం ఉంది. ఇది బ్రిటీష్ వారి కాలంతో వారి జెండా ఎగరవేయటం కోసం నిర్మించినట్లు తెలుస్తుంది. అంతేగాక దీని పైకెక్కి సుదూరంగా వస్తున్న శత్రువులను కూడా పసిగట్టవచ్చును. ఒకప్పుడు ఈ స్తూపంపైకి ఎక్కడానికి వీలుగా ఒక ఇనుప నిచ్చెన ఉండేది. కానీ ప్రమాదాలు జరగకుండా దానిని తరువాత తొలగించారు. భారత జాతీయ పతాకాన్ని నిరంతరం ఎగరవేయటం కోసం దేశమంతా కొన్ని ఎత్తైన స్తూపాలను ఎన్నిక చేయగా కొండారెడ్డి బురుజు ఐదవ స్థానం పొందింది.

విజయనగర సామ్రాజ్య పాలకులు ఒక యుద్ధ తంత్రంగా శత్రువులను గమనించేందుకు ఈ బురుజును ఎత్తుగా నిర్మించారు.

# అది విష్ణుస్తంభమే...

భారతీయ లోహశాస్త్ర-సాంకేతిక చరిత్రకు సజీవ సాక్ష్యం ఆ స్తంభం. వివిధ రకాల వాతావరణ పరిస్థితులను తట్టుకొని తుప్పపట్టకుండా వుండడం విష్ణు (ఇనుప) స్తంభం ప్రత్యేకత. ఇనుపస్తంభం తయా రయి 1600 సంవత్సరాలు పైబడినా.. చెక్కుచెదరక పోవడం నాటిలోహ పరిశ్రమ కారుల నైపుణ్యానికి చక్కని నిదర్శనం. సుమారు ఆరుటన్నుల బరువుగల విష్ణు (ఇనుప) స్తంభం రూపొందింది మధ్యప్రదేశ్‌లోని విదిశ పట్టణం దగ్గరగల ఉదయగిరిలో. అది అక్కడి నుంచి బయటకు ఎలా ఎప్పుడు వెళ్ళిందో ఎవరికీ తెలియదు. కానీ ప్రస్తుతం ఢిల్లీ మహానగరం లోని కుతుబ్‌మినార్ పక్కనవుంది. పాడుబడిన, విధ్వంసానికి గురయిన హిందూ, జైన ఆలయాల సముదాయం మధ్యలో 23.8 అడుగుల ఎత్తయిన ఇనుపస్తంభం వుంది. గుప్త రాజుల వైష్ణవ భక్తికి తార్కాణంగా ఇనుపస్తంభంపై ఒక శాసనం కలదు. శ్రీ మహావిష్ణువును కీర్తిస్తున్న ఆ శాసనం రెండో చంద్రగుప్త విక్రమాదిత్య రాయించినది. ఇనుప స్తంభం రూపకర్తకూడా చంద్ర గుప్తుడే. ఉదయగిరి నుంచి ఇంద్రప్రస్థ (ఢిల్లీ) దాకా స్తంభం సాగించిన ప్రస్థానం ఆసక్తికర అంశం. అద్భుతమైన లోహనైపుణ్యం, ఖగోళ శాస్త్ర అధ్యయనాల్లో కీలక పాత్ర పోషించిన ఢిల్లీ విష్ణు (ఇనుప) స్తంభంపై టూరిజం న్యూస్ ప్రత్యేక కథనం.

ఢిల్లీలోని పలుచారిత్రక, పర్యాటక, సాంస్కృతిక, స్మృతి ప్రదేశాల్లో విష్ణు (ఇనుప) స్తంభం అత్యంత ముఖ్యమైనది. దానిని ఐరన్ పిల్లర్, అశోకపిల్లర్ అనికూడా పిలుస్తారు. చారిత్రక కట్టడం కుతుబ్‌మినార్ సముదాయంలో ఇనుపస్తంభం వుంది. విశాలమైన ఆవరణం మధ్యలో స్తంభం వుంది. స్తంభం చుట్టూ మండపాలున్నాయి. మండపాల్లోని రాతి స్తంభాల్లో అద్భుత శిల్పసంపద కలదు. ఆ ఆవరణలో దాదాపు 27 హిందూ, జైన దేవాలయాలుండేవని చరిత్రకా రులు రాశారు. మండపాల్లోని దేవతల శిల్పాలను ఛిద్రం చేసిన విషయాన్ని స్పష్టంగా గమనించవచ్చు.



***విశిష్టత:*** శాస్త్ర-సాంకేతిక రంగం అంతగా అభివృద్ధి చెందని ఆ రోజుల్లో ఒక భారీ ఇనుపస్తంభాన్ని తయారుచేయడం మామూలు విషయం కాదు. తయారు చేసినా తుప్పుపట్టని విధంగా లోహ మిశ్రమాల తయారీలో రసాయనాలను వాడారంటే నాటి పాలకులు - శాస్త్రజ్ఞుల విజ్ఞానానికి చేతులెత్తి నమస్కరించవలసిందే. వివిధ రకాల రసాయనాలను వినియోగించి లోహ ముడి ఖనిజాలతో మిశ్రమాలను సరికొత్తగా ఆవిష్కరించడం, భారీ ఆకారంలో లోహ స్తంభాన్ని రూపొందించడం 1600 సంవత్సరాల కిందట అసాధారణం. అంత పెద్ద స్తంభాన్ని ఎలా రూపొందించారన్నది అంతుచిక్కని ప్రశ్న. ఢిల్లీ వంటి విభిన్న వాతావరణ పరిస్థితుల్లోనూ తుప్పుపట్టకుండా వుందంటే గుప్తరాజుల శాస్త్రజ్ఞుల లోహశాస్త్ర ప్రావీణ్యం అర్థమవుతుంది.



ఇనుము ముడిఖనిజం చాలా నాణ్యమైనదని, లోహమిశ్రమంలో భాస్వరం కూడా ఎక్కువ శాతం వాడారని నేటి ఆధునిక లోహ శాస్త్రవేత్తలు ప్రకటించారు. ఉత్తరప్రదేశ్‌లోని కాన్పూర్ ఐ.ఐ.టి శాస్త్రవేత్తలు ఇనుపస్తంభంపై విస్తృతంగా పరిశోధనలు చేశారు. ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, విపరీతమైన చలిని, ఎడారి గాలులను తట్టుకొని స్తంభం నిలబడడంలో లోహ మిశ్రమంలో వాడిన భాస్వరం ముఖ్య భూమికను పోషిస్తున్నదని శాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు.

***కళాత్మకం:*** విష్ణు (ఇనుప) స్తంభాన్ని ఎంతోకళాత్మకంగా రూపొందించారు. 23.8 అడుగుల ఎత్తుగల స్తంభం వ్యాసం ఒక అడుగు పైగా వుంది. నున్నగా వున్న స్తంభం బరువు ఆరువేల కిలోలకు (6 టన్నులు) పైగా వుంటుందని భారత పురావస్తు సర్వేక్షణ శాఖ నిర్ధారించింది. స్తంభం శిఖరాగ్రాన వివిధ ఆకృతులున్నాయి. అందులో వికసించిన పద్మం తిరగబడిన విధంగా వుంది. దానిపై ఒక చిన్న చక్రం, ఆపై పెద్ద చక్రం, దానిపై మరో చిన్న చక్రం ఆకారాలున్నాయి. అన్నింటి కంటే పైన చతురస్రాకారపు దిమ్మెలు కలవు. ఇనుప స్తంభం అశోక స్తంభాన్ని పోలి వుండడంతో కొందరు అశోక పిల్లర్ అంటున్నారు. ఇనుప స్తంభాన్ని ఎవరూ ముట్టుకోకుండా చూట్టూ కంచె ఏర్పాటు చేశారు. స్తంభం చుట్టుపట్ల సమాధులున్నాయి. శిథిల



కట్టడాలు ఎన్నోవున్నాయి. స్తంభానికి దక్షిణం వైపునున్న ఒక శిథిల కట్టం పర్షియన్ శైలిలో వుంది.

***శాసనం:*** ఇనుపస్తంభంలో ఐదు పంక్తుల్లో శాసనం కలదు. భాష సంస్కృతంకాగా లిపిబ్రాహ్మీ. శాసనం విష్ణువును కీర్తిస్తున్నది. కాశ్మీర్‌లోని సింధూనదిలోయ ప్రాంతం నుంచి దక్షిణానసముద్రం వరకు గుప్తరాజ్యం విస్తరించినట్లు శాసనం తెలుపుతున్నది. సింధూనది, దక్షిణ (హిందూ మహా) సముద్రం, వంగదేశం (పశ్చిమబెంగాల్), చంద్రగుప్తరాజు, విష్ణుపాదగిరి (ఉదయగిరి) తదితర పేర్లు శాసనంలో వున్నాయి. విష్ణువుకు ప్రతిరూపంగా, వైష్ణవ ధర్మతత్వానికి ప్రతీకగా స్తంభం వెలసింది. పాటలీపుత్ర రాజధానిగా భారతదేశాన్ని పాలించిన ***రెండో చంద్రగుప్త విక్రమాదిత్య (క్రీ.శ.380-415) ఇనుప స్తంభాన్ని తయారు చేయించాడు. ఖగోళ శాస్త్ర అధ్యయనాలకోసం ఇనుపస్తంభాన్ని ఉదయగిరి కొండపై నిలబెట్టారు. ఉదయగిరిని 'విష్ణుపాదగిరి'గా శాసనంలో పేర్కొన్నారు. మధ్యప్రదేశ్‌లోని ఉదయగిరిపై వెలసిన విష్ణు (ఇనుప) స్తంభం ఢిల్లీకి ఎలా చేరిందన్నది అంతు దొరకని రహస్యం.*** పురావస్తు, చారిత్రక పరిశోధనకుడు డాక్టర్ బంకేరాయ్ 1903 లో శాసనాన్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేశారు. సంస్కృత శాసన పాఠాన్ని ఇంగ్లీషులో ఒక బండపై రాయించి, దానిని ప్రవేశమండపం గోడలో భద్రంగా అమర్చారు. పరిశోధకులకు అది ఎంతగానో ఉపయోగపడుతున్నది.



విష్ణు స్తంభంపై విక్రమాదిత్య శాసనం

***ఉదయగిరి:*** ఉదయగిరి మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌కు సుమారు 62 కి.మీ, ప్రఖ్యాత బౌద్ధ యాత్రస్థలం సాంచికి 13.కి.మీ, ప్రముఖ చారిత్రక నగరం విదశకు 5 కి.మీ.ల దూరంలో వుంది. దాదాపు 40 వేల సంవత్సరాలకు ముందు ఆదిమ మానవులు ఉదయ గిరి గుహల్లో నివసించినట్టు ఆధారాలున్నాయి. రాతిగుహల్లో వారు చెక్కిన చిత్రాలు కలవు. అశోకుని కాలంలో విదిశ ముఖ్య వర్తక కేంద్రంగా, బౌద్ధధర్మ ప్రచార కేంద్రంగా వెలుగొందింది. విదశ పక్కనున్న ఉదయగిరి గుప్తుల కాలంలో వైష్ణవ కేంద్రంగా విలసిల్లింది. కొండలను తొలిచి అత్యద్భుత శిల్పాలను మలచారు. ఖగోళశాస్త్ర అధ్యయ నాలకు ఉదయగిరి కేంద్రబిందువయింది. కర్కాటకరేఖ (Tropic of cancer - ట్రాపిక్ ఆఫ్ క్యాన్సర్) ఉజ్జయిని, విదిశ సమీపంలో వెళ్ళుతున్నది. అందువల్లనే విష్ణుపాదగిరిపై రెండో చంద్రగుప్తుడు ఇనుప స్తంభాన్ని ఏర్పాటు చేయించాడు. 13వ గుహలో శయన భంగిమలో వున్న శ్రీ మహావిష్ణువు పై నీడ పడే విధంగా ఇనుప స్తంభాన్ని నిలబెట్టారు. ఆదిశేషునిపై పడుకొన్న విష్ణువు తల దక్షిణదిక్కుకు, పాదాలు ఉత్తరం వైపునకు వున్నాయి. విగ్రహం- గుహ తూర్పుకు అభిముఖంగా వుంది కొన్ని ప్రత్యేక రోజుల్లో సూర్యోదయ సమయంలో కిరణాలు విష్ణుపాదాలను తాకుతాయట. విష్ణుగుహకు ఎదురుగా రాతికొండవుంది. ప్రస్తుతం ఢిల్లీలోగల ఇనుప స్తంభాన్ని బహుశః ఆ రాతి కొండ పైనే వుంచి వుంటారు. ఇనుపస్తంభం నీడ విష్ణు పాదాలను తాకేదని చరిత్రకారులు రాశారు. స్తంభం నీడ కదలికల ఆధారంగా ఖగోళశాస్త్ర పరిశోధనలు జరిగాయి. ఆర్యభట్ట (క్రీ.శ 476-550), వరాహ మిహురుడు (క్రీ.శ 505-587) తదితరు లు ప్రాచీన ఖగోళశాస్త్ర అధ్యయనంలో ఎంతో ప్రసిద్ధి పొందారు.

కాగా ఉదయగిరి కొండల్లో 14



గుహలను తొలచి, దేవతా శిల్పాలను అద్భుతంగా ఆవిష్కరించారు. అన్నీ కూడా ఒకే రాతిలో మలచిన శిల్పాలే. 5వ గుహలో గల భూవరాహశిల్పం భారత దేశంలో ప్రఖ్యాతి గాంచింది. భారీ భూవరాహ స్వామి ఎత్తు 20 అడుగుల పైనే వుంటుంది. విగ్రహం ఎడమ కాలికిందున్న ఆదిశేషుడు భూవరాహ స్వామికి నమస్కరిస్తున్నాడు. దేవతలు, రుషులు, యక్షులు, తదితరుల బొమ్మలు గుహగోడ లపై వున్నాయి. శివలింగాలు, రాజుల ప్రతిమలు వున్నాయి.

ఢిల్లీలోని విష్ణు (ఇనుప) స్తంభం ప్రస్థానాన్ని దేశ వ్యాప్తంగా అన్ని భాషల్లో పాఠ్యాంశంగా బోధించాలి. భారతీయ లోహశాస్త్ర- సాంకేతికత, ఖగోళశాస్త్ర విజ్ఞానానికి సజీవ సాక్ష్యం ఆ ఇనుప స్తంభం. విశిష్టమైనది ఆ విష్ణు స్తంభం.

చంద్రగుప్త విక్రమాదిత్య



ఉదయ గిరి గుహలోని ఆది భూ వరాహ విగ్రహం

గిర్నార్ శాసనం

ఎర్రగుడి శాసనం

ప్రత్యేకం

# అశోకుడు మాట్లాడుతున్నాడు

మైనాస్వామి




ప్రపంచంలో ఎవరికీలేని ఆలోచన మౌర్య సామ్రాజ్య మహాచక్రవర్తి అశోకునికి వచ్చింది. అదేమంటే.. ప్రజలతో నిరంతరం మాట్లాడడం. రాజసభ లేదా ప్రజాదర్బార్‌లలో అతికొద్ది మందితో మాత్రమే మాట్లాడే అవకాశం కలుగుతుంది. అదే సమాచార ప్రచారం ద్వారా అయితే కోట్లాది మంది ప్రజలతో సంభాషించే వీలుంటుంది. అశోకుని ఆలోచన సరికొత్త సమాచార ప్రచార సాధనా వ్యవస్థకు శ్రీకారం చుట్టింది. ప్రపంచంలో అంతవరకూ ఎవరూ అనుసరించని పద్ధతిని తన సామ్రాజ్యంలో ప్రవేశపెట్టాడు. తను చెప్పదలచుకొన్న విషయం నేరుగా ప్రజలను చేరాలంటే ... శాసనాలే సరైన సాధనాలని భావించి దేశమంతటా రాతి బండలపై రాజు ఆదేశాలను, ధర్మసందేశాలను శాసనాలుగా చెక్కించాడు. దేవానాంప్రియ, ప్రియదర్శి, అశోకుడు... మీతో మాట్లాడుతున్నాడు' అంటూ పలు అంశాలను శాసనాల్లో పొందు పరచాడు. రాష్ట్రికుడు, రజ్జకుడు, మహామాత్రుడు అనే అధికారులు తన ఆజ్ఞలను అమలు చేసే బాధ్యతలను నిర్వర్తిస్తూ, ప్రజాసంక్షేమానికి నిరంతరం పాటుపడాలని ఆదేశించాడు. సత్యం - శాంతి - సహనం, ప్రేమ - కరుణ - దయ, రాజు - రాజకుటుంబీకులతో సహా ప్రజలంతా ధర్మాన్ని ఆచరిస్తూ... ధర్మబద్ధమైన జీవితాన్ని గడపాలని అశోకుడు తన శాసనాల్లో అభిలషించాడు. కాశ్మీర్ నుంచి కర్నాటక దాకా, తక్షశిల నుంచి ధౌళి వరకు వేలాది శాసనాలు వెలిశాయి. బండరాళ్ళు, పెద్దగుండ్లు అశోకుని ధర్మసందేశానికి అద్భుత ప్రచార సాధనాలయ్యాయి. మౌర్య మారాజు శాసనాలను గుహా శాసనాలు, స్తంభశాసనాలు, చిన్న-పెద్ద శాసనాలుగా విభజించవచ్చు. చిన్న - పెద్ద శాసనాలు బండలు - గుండ్లపై వున్నాయి. చండ అశోకుడు ధర్మ అశోకునిగా మారిన తర్వాత రాజ్యంలో 84 వేల బౌద్ధ స్తూపాలు ఆవిష్కృతమయ్యాయి. స్తూపాలు బౌద్ధధర్మం - సంస్కృతి వ్యాప్తికి దోహదపడ్డాయి.



కళింగ యుద్ధంలో ఒకటిన్నర లక్షమంది చనిపోవడంతో... మహాచక్రవర్తి తీవ్ర మనో వ్యథకు గురై యుద్ధాలకు స్వస్తి చెప్పాడు. వెంటనే తన ఆలోచనకు అక్షరరూపం ఇస్తూ దయానది పక్కనున్న ధౌళిలో 'యుద్ధభేరి కాదు - ధర్మభేరి మోగించా'లని గుండుపై శాసనాన్ని చెక్కించాడు. ధౌళిశాసనం క్రీస్తు పూర్వం 261 నాటిది. మౌర్య వంశజుడు మూర్ధాభిషిక్తు డయిన 8 సంవత్సరాల తర్వాత కళింగ యుద్ధం జరిగింది. ఆ యుద్ధం తెచ్చిన పరివర్తనతో దేశమంతటా ధర్మప్రచార శాసనాలు వెలిశాయి. అటువంటి శాసనాల్లో అత్యంత ముఖ్యమైనది ఎర్రగుడి శాసనం. తల్లిదండ్రుల మాట మీరకూడదని, పెద్దలను గౌరవించాలని, జీవహింస చేయరాదని, సర్వశ్రేయోరాజ్యం కోసం నిరంతరం పాటుపడడం, కళింగ యుద్ధానంతరం జరిగిన పరిణామాలు, తన ధర్మదీక్ష, ప్రజల్లో ధర్మజ్ఞాన జ్యోతులు వెలిగించడం, మనుషులు - పశువులకు వేర్వేరుగా వైద్యశాలలు నిర్వహించడం, బాటలు నిర్మించడం, బావులు తవ్వించడం, బాటలకిరువైపులా చెట్లు నాటించడం, బాటసారులకు సౌకర్యాలు సమకూర్చడం... వంటి ఎన్నో ముఖ్యమైన విషయాలను ఎర్రగుడి శాసనాలు వివరిస్తున్నాయి. అశోకుని శాసనాలు కొలువుదీరిన ఏనుగుకొండ - రాళ్ళగుట్ట ఎర్రగుడి - జొన్నగిరి గ్రామాల మధ్యవుంది. రాళ్ళగుట్ట ప్రదేశం ఎర్రగుడి గ్రామ పొలాల్లో వుండడంతో ఎర్రగుడి శాసనాలుగా ప్రసిద్ధి చెందాయి. జొన్నగిరి పూర్వం పేరు స్వర్ణగిరి. మౌర్య సామ్రాజ్యంలో దక్షిణ రాష్ట్ర రాజధానీ నగరం. స్వర్ణగిరి సువర్ణగిరి, సొర్నగిరి, జొన్నగిరిగా రూపాంతరం చెందింది. రాష్ట్ర కేంద్రం కనుకనే అశోకుడు అక్కడ శాసనాలను రాయించాడు.



అమరావతి స్తూపశిల్పాల్లో అశోక చక్రవర్తి

ఎర్రగుడి శాసనాలపై 'టూరిజం న్యూస్' ప్రత్యేక కథనం.



సాంచీ స్తూపంలో అశోకుడు



ఎర్రగుడి రాతిగుట్ట



దే వా నాం పి యే న పి య ద సి

ఎర్రగుడి గుట్ట కర్నూలు జిల్లా తుగ్గలి మండలంలో వుంది. అనంతపురం జిల్లా గుత్తికి 13 కి.మీ. దూరంలో వుంది.

ఎర్రగుడి రాతిగుట్టను దూరం నుంచి చూస్తే ఏనుగు ఆకారంలో కనిపిస్తుంది. అందువల్ల ఆ గుట్టను 'ఏనుగుకొండ' అని పిలుస్తున్నారు. ఏనుగుకొండలోని 6 బండరాళ్ళకు 'ఎ,బి,సి,డి,ఇ, ఎఫ్' అని పేరు పెట్టారు. ఆరు బండరాళ్ళపై 14 శాసనాలను చెక్కారు. 'ఎ' రాయిపై మాత్రమే 4 శాసనాలున్నాయి. 'ఎ' బండరాయి అన్నిటికంటే పెద్దది. 'ఎ' బండపై 1,2,3, 14 శాసనాల సారాంశాన్ని పొందుపరచారు. 'ఎ' బండ తూర్పు ముఖంగా వుంది. ఆ రాయి 17 అడుగుల పొడవు, 6 అడుగుల ఎత్తు వుంది. శాసనాలు రాసిన లిపి 'బ్రాహ్మీ' కాగా, అందులోని భాష 'ప్రాకృతం'. దానిని బట్టి ఆంధ్రదేశంలోని ప్రజలవాడుక భాష ప్రాకృతం అయి వుండవచ్చునని భావించవచ్చు. అశోకునికంటే ముందు కాలానికి చెందిన 'భట్టిప్రోలు' శాసన లిపి బ్రాహ్మీ మరియు భాష ప్రాకృతమే. క్రీస్తు పూర్వం 400 సం.రం నాటి గణపెద్ద కుభీరకుడు భట్టిప్రోలు శాసనకర్త అని భారత పురాతత్వ శాస్త్రవేత్తలు తేల్చారు. గుంటూరు జిల్లా తెనాలికి దగ్గరలో సముద్రతీరంలో భట్టిప్రోలు గ్రామం వుంది. అక్కడ నిర్మించిన బౌద్ధస్తూపంలోని పేటికలలో శాసనాలున్నాయి. తెలుగునేలపై లభించిన తొలిశాసనం అదే. ఆ శాసనం మద్రాసు మ్యూజియంలో ఒకమూలన పడివుంది.



కాగా బ్రహ్మీలిపి, ప్రాకృత భాషపరిజ్ఞానం కలిగివున్నప్పటికీ ఎర్రగుడి శాసనాలను చదవడం అంతసులువు కాదు. బండరాళ్ళు నునుపుగా లేవు. ఎగుడుదిగుడుగా వున్నాయి. 'ఎ' బండరాయిపై చెక్కిన 1,2,3, 14 శాసనాలను చదవడం చాలా కష్టమే. శాసన బండలు పగుళ్ళుపారాయి. సుమారు 2 వేల 265 సంవత్సరాల నుంచి శాసన బండలు ఎండకు ఎండుతూ, వర్షానికి తడిసినందువల్ల నెర్రలు చీలాయి. అవి మరింత పాడుకాకుండా భారత పురాతత్వశాఖవారు రసాయనిక చర్యలు చేపట్టారు.

**పశ్చాత్తాపం :** అశోకుని 14 శిలాశాసనాలు... అన్నీ ఎర్రగుడి రాళ్ళలో వున్నాయి. 1,2 చిన్న శాసనాలు 'ఎ' బండపై వున్నాయి. అవే శాసనాలు మార్పుతో 'ఎఫ్' బండపై కూడా వున్నాయి. మొత్తం 16 శాసనాలు ఒకే చోట వుండడం అరుదైన విషయం. 'దేవానాం ప్రియుడు – ప్రియదర్శి అయిన రాజు యొక్క అజ్ఞచే ఈ ధర్మశాసనం రాయబడింది' అని ఒకటో చిన్న శాసనం మొదటి పంక్తి తెలుపుతున్నది. 'జీవహింస చేయరాదని, జంతుబలిని నిషేధించామని తర్వాతి వరుసల్లో వివరించారు. రెండో చిన్న శాసనంలో మనుషులకు, పశువులకు వేర్వేరుగా వైద్యశాలలు రాజ్యమంతటా ఏర్పాటు చేసినట్టు పేర్కొన్నారు'. మగధరాజ్యం బయట, పొరుగు రాజ్యాలైన చోళ, పాండ్య, సతీకపుత్ర, తామ్రపర్ణి (శ్రీలంక), యవన, గ్రీకు దేశాల్లోనూ దేవానం ప్రియుడు వైద్యశాలలు నెలకొల్పాడు. మనుషులకు, పక్షులకుపయోగదేవిధంగా ఫలాలను ఇచ్చే చెట్లు, ఔషధాలు తయారు చేయడం కోసం మూలికావనాలను ప్రియదర్శి పెంపొందింప చేశాడు. రహదారులు నిర్మించడంతోపాటు – రహదారుల కిరువైపులా చెట్లు నాటించాడు. బాటసారుల కోసం బావులు తవ్వించాడు.

'ఎఫ్' బండరాయిపై చెక్కిన మొదటి చిన్న శాసనం.. **"దేవానాంపియే హేవాహ అధికాని (ప్రాకృతం).. దేవానాం ప్రియుడు (అశోకుడు) ఈ విధముగా మాట్లాడెను"** అని మొదలవుతుంది.

(మిగతా 32వ పేజీలో)

## గొప్పదనం

**"ప్రపంచాన్ని ఎంతో గొప్పగా ప్రభావవంతం చేసిన ఆరుగురు మహోన్నత వ్యక్తుల్లో అశోక చక్రవర్తి" ఒకరు" అని ప్రపంచ చరిత్రకారుడు హెచ్.జి.వెల్స్ ప్రశంసించారు. వెల్స్ కొనియాడిన మిగతా ఐదుగురు... బుద్ధుడు, సోక్రటీస్, రోగర్ బకన్, అబ్రహాంలింకన్. తనరాజ్యంలో నివసించే ప్రజలు మాత్రమే గాక ప్రపంచ ప్రజలంతా సుఖ శాంతులతో జీవించాలని అశోకుడు ఆకాంక్షించాడు. ప్రజా సంక్షేమం కోసం ఎన్నో పథకాలను అమలు చేశాడు. రాజ్యంలో తొలిసారిగా ప్రజా వైద్యశాలలు వెలిశాయి. జంతువులకోసం ప్రత్యేక పశువైద్యశాలలు ఏర్పాటయ్యాయి. జీవహింస జరగరాదని, జంతుబలులు నిర్వహించే జాతరలను నిషేధిస్తున్నామని రాజాజ్ఞలు వెలువడ్డాయి. మగధసామ్రాజ్యంలో ప్రయాణాలు సులువుగా సాగడానికి నలుదిక్కులా రహదారులు నిర్మితమయ్యాయి. ప్రయాణికులకు సౌకర్యాల కల్పనలో భాగంగా రహదారుల వెంబడి చెట్లను నాటించాడు. బావులు తవ్వించాడు. బాటసారుల విశ్రాంతి కోసం ధర్మసత్రాలు కట్టించాడు. తాను స్వయంగా ధర్మాన్ని ఆచరిస్తూ.. ప్రజలకంతా ధర్మమార్గాన్ని అనుసరించాలని దేశ-విదేశాల్లో ధర్మ సందేశ శాసనాలను చెక్కించాడు. అందువల్లనే ప్రపంచ చరిత్రకారులు అశోకుని గొప్పదనాన్ని పొగిడారు. మగధమహారాజు సాగించిన ధర్మపాలనను నేటి పాలకులు కొనసాగిస్తే... ఆధునిక సమాజం ఎంతో గొప్పగా అభివృద్ధి అవుతుంది.**







## SRI VENKATESWARA VEDA PARIRAKSHANA TRUST

**Overview:**

The Vedas, the treasure - trove of Sanatana Dharma, tradition and culture contain codes of righteous conduct and spiritual revelations. Tirumala Tirupati Devasthanams set up Sri Venkateswara Veda Parirakshana Trust in March, 2007 to perpetuate the vedic tradition.

**The objectives of the schemes are as follows :**

* To identify, study and bring to light vedic knowledge, which is the heritage of all mankind.

* To take all necessary steps through any and all possible means, for the propagation of the invaluable knowledge contained in the Vedas, to enlighten the masses about them and to encourage them to lead a purposeful, fruitful, peaceful and co-operative life as socially responsible members of the global social environment.

* To co-operate, to associate with, in any manner considered appropriate including by giving financial grant in aid to any individual or groups of individuals, institutions or bodies that in the perception of the trust, carry on any activities in harmony with the objects of the Trust.

* To take all necessary steps for the preservation and dissemination of knowledge etc., aforesaid by any suitable and contemporary means to ensure its perpetuity and uninterrupted availability for the benefit of the present and future generations by translating the vedic texts into all languages preserving and their audio, audio visual records maintaining appropriate data bases.

**DONATION AMOUNT:**

The minimum contribution for the scheme is Rs.1000/- Donation below Rs.1000/- will be credited to the account of Srivari Hundi without any intimation to the donor. **"The donations received to this Trust will go to Corpus Fund"**. All donations are deposited in a Nationalized Bank, and interest earned is utilized for the scheme.

Donations can be made by way of Cheque / Demand Draft on any scheduled bank drawn in favour of **"The Executive Officer, Sri Venkateswara Veda Parirakshana Trust, T.T.D., Tirupati" and can be sent to the Addl. F.A. & C.A.O, T.T.D., Tirupati - 517 501.**

**For further information contact Ph.0877 - 2277777 or 2233333 or 2264258.**

**Individuals, firms, companies etc. can make donations, and they are eligible for uniform privileges besides Income Tax Benefit under Section 80 (G) of the Indian Income Tax Act.**

RO No. TTD-40021(31)/1/2019/Adv No.13/PRO/2020 Dt. 16-02-2020

# ‘లేపాక్షి.. నేటి తరానికి స్ఫూర్తి’

■ తనికెళ్ళ భరణి




‘విజయనగర సామ్రాజ్య సాంస్కృతిక వైభవానికి ప్రతీక అయిన లేపాక్షి పుస్తకం నేటి తరానికి స్ఫూర్తినిస్తుంద’ని ప్రఖ్యాత సినీ రచయిత – నటుడు శ్రీ తనికెళ్ళ భరణి అన్నారు. హైదరాబాద్ రవీంద్ర భారతి మినీహాల్‌లో ఆం.ప్ర. పర్యాటక సంస్థ పూర్వ అధ్యక్షుడు ‘ధర్మశ్రీ’ చెన్నూరు ఆంజనేయ రెడ్డి అధ్యక్షతన జరిగిన ‘లేపాక్షి’ ఆవిష్కరణ సభలో భరణి గౌరవ అతిథిగా ప్రసంగించారు. ‘తెలుగు భాష – చరిత్ర – సంస్కృతి పరిరక్షింపబడాలంటే లేపాక్షి వంటి పుస్తకాలు మరిన్ని రావాలి. వాటిని పాఠకులు బాగా ఆదరించినప్పుడే తెలుగు జాతి గొప్పదనం తెలుస్తుంది’ అని ఆయన ఆకాంక్షించారు. ‘లేపాక్షి’ రచనావిధానం, శాసనాల పరిశోధన, శిల్పశోభ, తైలవర్ణచిత్రాల గాథా విశేషాల వివరణ.. వెరసి పుస్తకం పాఠకుల హృదయాలకు హత్తుకొంటుందని తనికెళ్ళ భరణి పేర్కొన్నారు. విజయనగర సామ్రాజ్య విశేషాలను తెలిపే ఒక గొప్ప పుస్తకాన్ని అందించిన మైనాస్వామి అభినందనీయుడని ఆయన అన్నారు.

*లేపాక్షి పుస్తకాన్ని పాఠ్యాంశంగా పెట్టాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి తనికెళ్ళ భరణి విజ్ఞప్తి చేశారు.*




అనంతపురం జిల్లా లేపాక్షి వీరభద్రాలయంలో దాగిన ఎన్నో అంశాలను వెలుగులోకి తేవడంలో రచయిత విజయం సాధించారని కార్యక్రమ నిర్వహణ అధ్యక్షుడు శ్రీ ఆంజనేయ రెడ్డి అభిప్రాయపడ్డారు. లేపాక్షి శిల్పాలు – వర్ణ చిత్రాల వర్ణన అద్భుతంగా వుందని ఆయన అభినందించారు. ‘దక్షయజ్ఞం’ యక్షగాన నాటకాన్ని వీరభద్ర స్వామి సన్నిధిలో ప్రదర్శించడానికి పర్యాటక శాఖ చర్యలు చేపట్టాలని శ్రీ ఆంజనేయరెడ్డి సూచించారు. తెలుగు రాష్ట్రాల్లోని ప్రధాన దేవాలయాల్లో, పర్యాటక ప్రదేశాల్లో సాంస్కృతిక ప్రదర్శనలు నిరంతరం జరగడానికి కృషి చేస్తానని గౌరవ అతిధి తెలంగాణ రాష్ట్ర పర్యాటక – సాంస్కృతిక శాఖ కార్యదర్శి శ్రీ కె.ఎస్.శ్రీనివాస రాజు చెప్పారు. లేపాక్షి గుడితో ముడిపడివున్న తన బాల్యస్మృతులను కార్యదర్శి వివరించారు. లేపాక్షి వంటి పుస్తకాలు చదువుతుంటే తెలుగువారి శిల్పకళాచాతుర్యం, ప్రాచీన సంస్కృతి, నాటి జనజీవన విధానాలు తెలుస్తాయని శ్రీ శ్రీనివాసరాజు అన్నారు.

లేపాక్షి గుడి ఆవిర్భావానికి మూలమైన ‘దక్షయజ్ఞం’ పురాణ గాథను మైనాస్వామి చక్కగా రాశారని శ్రీ దైవజ్ఞశర్మ కొనియాడారు. పుస్తకం తనను ఎంతగానో ఆకట్టుకొన్నదని ఆయన తెలిపారు.






విజయవాడలో ‘లేపాక్షి’ పరిచయసభ





సభలో ప్రసంగిస్తున్న ఆంజనేయ రెడ్డి, శ్రీనివాస రాజు

# 'చారిత్రక ప్రదేశాల పరిరక్షణకు పాటుపడాలి'

**- ప్రొఫెసర్ కె. హేమచంద్రారెడ్డి,**
ఉన్నత విద్యామండలి అధ్యక్షులు



ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో చారిత్రక ప్రదేశాలు, సంస్కృతీ కేంద్రాలున్నాయని, వాటి పరిరక్షణకు ప్రతి ఒక్కరూ పాటుపడాలని ఆం.ప్ర. రాష్ట్ర ఉన్నత విద్యామండలి అధ్యక్షులు ప్రొఫెసర్ కె. హేమచంద్రారెడ్డి పిలుపునిచ్చారు. ప్రముఖ చారిత్రక పరిశోధకుడు - రచయిత మైనాస్వామి రాసిన 'విజయనగర సామ్రాజ్య సాంస్కృతిక వైభవానికి ప్రతీక - లేపాక్షి' పుస్తక పరిచయ సభ విజయవాడలో ఇటీవల జరిగింది. ఉన్నత విద్యామండలి అధ్యక్షులు ముఖ్యఅతిథిగా పాల్గొంటూ.. లేపాక్షి శిల్పకళావైభవాన్ని, తైలవర్ణ చిత్రాల గొప్పదనాన్ని వివరించారు. ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలకు నిలయాలైన లేపాక్షి వంటి ఎన్నో విశేషకట్టడాలను నేటి తరానికి పరిచయం చేయవలసిన బాధ్యత రచయితలపై వుందని ప్రొ. హేమచంద్రారెడ్డి అభిప్రాయపడ్డారు.

విజయనగర సామ్రాజ్య వైభవంతో పాటు చరిత్ర - శాసనాలు - రాజ్యంలోని సహనశీల మత ధర్మం' లేపాక్షి వీరభద్ర స్వామి సన్నిధిలోని శిల్పాలు - తైలవర్ణచిత్రాల గాథలను రచయిత గొప్పగా వివరించారని ప్రముఖ సాహితీవేత్త డాక్టర్ గుమ్మా సాంబశివరావు 'లేపాక్షి'పై విశ్లేషించారు. లేపాక్షి చరిత్రకు మూలాధారమైన 'చలివెందుల శాసనా'న్ని వెలికితీసినందుకు మైనాస్వామిని అభినందించారు. రాష్ట్రంలోని ఉన్నత పాఠశాలలు - కళాశాలల విద్యార్థులు లేపాక్షి గుడిని సందర్శించడానికి ఉపాధ్యాయులు, అధ్యాపకులు చర్యలు చేపట్టాలని గ్రామ సచివాలయాల సంయుక్త సంచాలకులు శ్రీ మొగిలిచెండు సురేష్ విజ్ఞప్తి చేశారు. లేపాక్షి గుడి గాథలతో పాటు విజయ నగర సామ్రాజ్య చరిత్రను వివరించడంలో మైనాస్వామి తన ప్రతిభను చాటారని సీనియర్ పాత్రికేయుడు శ్రీ చందు జనార్ధన్ ప్రశంసించారు. ప్రముఖ రచయిత శ్రీ వేంపల్లి షరీఫ్, శ్రీ గోళ్ళ నారాయణ రావు తదితరులు సభలో పాల్గొన్నారు.

లేపాక్షి వీరభద్రస్వామి సన్నిధిలోని ప్రతి అంశాన్ని పరిశీలించి పరిశోధించి పుస్తకాన్ని చక్కగా పొందు పరిచారని ప్రముఖ చారిత్రక పరిశోధకుడు డాక్టర్ ఈమని శివనాగిరెడ్డి ప్రశంసించారు. చలివెందుల శాసనంలోని అంశాలు, లేపాక్షి చరిత్రను తెలిపే పలు శాసనాలను రచయిత వివరించిన తీరును పరిశీలిస్తే మైనాస్వామి పరిశోధనా పటిమ తెలుస్తుందని డా.రెడ్డి పేర్కొన్నారు. పుస్తకంలో గుడి విశేషాలతో పాటు చక్కని ఫోటోలను చూస్తుంటే... ఒక దృశ్యకావ్యంలా సాగిపోతుంటుంధని ఆయన అన్నారు. 'లేపాక్షి పుస్తకం చదివిన వెంటనే వీరభద్రస్వామి సన్నిధిని సందర్శించాలన్న ఆసక్తి కలుగుతుంది. విజయనగర సామ్రాజ్య వైభవాన్ని - చరిత్రను మరింతగా చదవాలని జిజ్ఞాస కలుగుతుంది' అని ప్రముఖ సినీ-నాటక కళాకారుడు, పద్యనాటకాల దిట్ట శ్రీ గుమ్మడి గోపాలక్రిష్ణ చెప్పారు. పుస్తకానికి చదివించే శక్తి వుందని ఆయన అన్నారు.

పదహారు నెలల పరిశోధన - నిరంతర కృషికి అక్షర రూపమే ఈ 'లేపాక్షి' అని పుస్తక రచయిత - చారిత్రక పరిశోధకుడు శ్రీ మైనాస్వామి వివరించారు. లేపాక్షికి అంతర్జాతీయ ఖ్యాతి దక్కనందుకు ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. వీరభద్రస్వామి సన్నిధిని ఐక్యరాజ్యసమితి ప్రపంచ వారసత్వ కట్టడాల జాబితాలో చేర్చడానికి చర్యలు చేపట్టాలని కేంద్ర - రాష్ట్ర ప్రభుత్వాలకు రచయిత విజ్ఞప్తి చేశారు. తెలంగాణ రాష్ట్ర ప్రోటోకాల్ విభాగం అధికారి శ్రీ ఆర్.ఎస్.వి. బద్రీనాథ్ స్వాగతోపన్యాసం చేయగా, ఉస్మానియా విశ్వవిద్యాలయం ' డీన్ ' ప్రొఫెసర్ బాలకిషన్ వందన సమర్పణ చేశారు.

ప్రొఫెసర్ మోహన్‌రామ్ (టెక్సాస్), డా. రాజేశ్వరరావు, శ్రీమతి ఐరావతి రాఘవరెడ్డి, శ్రీ జి.వి.నరసింహారావు, శ్రీ వై.బి.రెడ్డి, శ్రీ సుభాష్ గౌడ్, రిషిన్ రాతలు విజయ్, అల్విన్ రమణయ్య, ఆడిటర్ రాఘవరావు, కరావులపల్లి మహేష్ తదితరులు కార్యక్రమంలో పాల్గొని రచయితను అభినందించారు.

**- మైలారం మంజునాథ్**
**(మైలారం మహేష్ సహకారంతో)**
**ఫోటోలు : రాజ్ కుమార్**



డా. మోహన్ రామ్ (టెక్సాస్) కి లేపాక్షి పుస్తకాన్ని అందజేస్తున్న మైనాస్వామి, శ్రీనివాసరాజు





శ్రీమతి ఐరావతి రాఘవ రెడ్డికి, వై.బి. రెడ్డికి లేపాక్షి పుస్తకాన్ని అందజేస్తున్న శ్రీనివాసరాజు



*(28వ పేజీ తరువాయి)*

శాసనమంతా బౌద్ధధర్మ ప్రచారానికి సంబంధించినదే. శాసనం 11 వరుసలుండగా.. 11వ వరుసలో "ఇయం చ సావనే సావాపితె వ్యూథేన 200 50 6 (ప్రాకృతం).. దేశంలో 256 రోజుల పర్యటన తర్వాత నేను ఈ ధర్మ సందేశ శాసనాన్ని ప్రకటించాను" అని వుంది. రెండో చిన్నశాసనంలో జీవుల పట్ల ప్రేమ, దయ, కరుణ కలిగి వుండడం, సత్యం - ధర్మం ఆచరించడం, తల్లిదండ్రులు - పెద్దలను గౌరవించడం తదితర విషయాలను వివరించాడు.

చండ అశోకుని రాజ్యకాంక్షతో పట్టాభిషిక్తుడయిన 8 సంవత్సరాల తర్వాత జరిగిన కళింగ యుద్ధంలో లక్షలాది మంది ప్రాణాలు బలికావడం, కళింగయుద్ధ రక్తపాతాన్ని కళ్ళారా చూసి, యుద్ధ విముఖుడైన ప్రియదర్శిరాజు తీవ్ర మనోవ్యధకుగురై పశ్చాత్తాపపడి బౌద్ధ ధర్మం వైపు మొగ్గుచూడపం తదితర విషయాలను 13వ శిలాశాసనంలో విపులంగా వివరించడం జరిగింది. 13వ శాసనం - 'బి' బండపై 1 నుంచి 29 వరుసలు, 30 నుంచి 36వ వరుసదాకా 'సి' బండపై చెక్కారు. 36 వరుసల్లో అత్యంత ప్రాముఖ్యమైన అంశాలను పొందుపరిచారు. 'బి', 'సి' రాతిబండలపై మొత్తం 27 వాక్యాలున్నాయి.

"1. అఠవస అభిసితన దేవానాం పియన పియదసినెలాజినె కలిగా విజాతా (ప్రాకృతం).. దేవానాంప్రియ ప్రియదర్శి పట్టాభిషేకం జరిగిన 8 సంతవ్సరాల తర్వాత కళింగ రాజ్యాన్ని జయించాడు" అంటూ 13వ శిలశాసనం ప్రారంభమవుతుంది.

2. కళింగ యుద్ధంలో లక్షలాది పశువులు - మనుషులు ఖైదీలుగా తరలించారు. లక్షమందికి పైగా సైన్యం యుద్ధంలో మరణించగా మరికొంత మంది వివిధ బాధలతో చనిపోయారు.

3. మారణహోమం తర్వాత కళింగ విజయం సిద్ధించింది. దానితర్వాత దేవానాం ప్రియుడు ధర్మచింతన - ప్రచారం చేయడానికి సంకల్పించాడు.

4. కళింగయుద్ధంలో సంభవించిన అపార ప్రాణనష్టమే దేవానాం ప్రియుని మనసులో మహామార్పునకు కారణ భూతం.

..............................................

..............................................

14. దేవానాం ప్రియుడు పశ్చాత్తాపం చెందాడు. చెడ్డపనులు చేసే వారిని శిక్షించే శక్తి వున్నా.. వారిని సన్మార్గంలోకి తేవాలి. అంతేతప్ప నేరం చేసిన వారిని చంపడం లేదు. (క్షమాభిక్ష)

15. నేరస్తులలో పరివర్తన తేవడమే రాజుయొక్క కర్తవ్యం.

16. ధర్మవిజయమే అత్యున్నతమైనదని దేవానాం ప్రియుని భావన.

17. దేవానాం ప్రియుని రాజ్యంతో పాటు శతయోజనాల దూరంలోని ఇతర రాజ్యాల్లోనూ అశోకచక్రవర్తి పాటిస్తున్న బౌద్ధధర్మం అమలులో వుంది. పడమర దేశాల రాజులైన - సెల్యూకస్ నికటర్ (చంద్రగుప్తుని చేతిలో ఓడినవాడు) మనుమడు ఆంటియోకస్-2 (సిరియా - క్రీ.పూ. 261-246), తులుమాయి (టాలెమి ఫిలడెల్ఫస్-2, ఈజిప్ట్ - క్రీ.పూ. 278-230), మకా (మగస్-సిరినె-క్రీ.పూ. 300-250), అలిక సుందర (అలెగ్జాండర్-ఎపిరస్ దేశం - క్రీ.పూ. 272-255), దక్షిణాన తామ్రపర్ణి (శ్రీలంక), చోళ-పాండ్య దేశాల్లో కూడా అశోకుని బౌద్ధధర్మం వ్యాప్తి చెందింది. (17వ వాక్యంలో పేర్కొన్న విదేశీ రాజులందరూ అశోకుని సమకాలికులే. మగధ రాజ్య దౌత్యవేత్తలు ఆయాదేశాల్లో పనిచేస్తున్నారు. ఆ దేశాల దౌత్యవేత్తలు మగధలో వున్నారు. అశోకుడు అద్భుతమైన విదేశీ విధానాన్ని అవలంబించి ఖండాంతర ఖ్యాతిని ఆర్జించాడు).

18. అదేవిధంగా నారాజ్యంలోని యవన, కాంభోజ, నాభక, నాభపంక్త, భోజ పితినిక, ఆంధ్ర, పాలిత రాష్ట్రాల ప్రజలు ధర్మమార్గాన్ని అనుసరిస్తున్నారు.

..............................................

....................

***24. నా వారసులు రాజ్య విస్తరణ కాంక్ష లేకుండా జీవించాలి. శాంతి-సహనం పాటించాలి. యుద్ధం అనివార్యమయితే పరాజితుల పట్ల క్షమాగుణం ప్రదర్శించాలి. తగుమాత్రం దండన విధించాలి. ధర్మవిజయమే నిజమైన విజయమని గ్రహించాలి.***

25. అటువంటి ధర్మవిజయమే ఇహ-పర సౌఖ్యాలను కలిగించును.

26. ధర్మం వల్ల కలిగే ఆనందం శాశ్వతమైనది.

27. ఎందుకనగా ధర్మం ఇహ-పర సౌఖ్యాలకు మూలం

ఆవిధంగా అశోకుడు 13వ శిలాశాసనంలో పశ్చాత్తాపాన్ని ప్రకటించాడు. స్వదేశంతోపాటు, విదేశాల్లోనూ బౌద్ధధర్మవ్యాప్తి చెందుతున్న విధానాన్ని వివరించాడు. ధర్మబద్ధ జీవితంతోనే స్వర్గసుఖాలు దక్కుతాయన్నాడు.

ఇలావుండగా ఎర్రగుడి రాళ్ళలో దాగిన అశోకుని శిలాశాసనాలు గుజరాత్‌లోని 'గిర్నార్' శాసనాలకు ప్రతిరూపమని పరిశోధకులు పేర్కొన్నారు. ఎర్రగుడికి 13 కి.మీ. దూరంలోని రాజుల మందగిరి (పత్తికొండ మండలం) శిలా శాసనంలో దేవానాం ప్రియుని 1, 2 శాసనాలు మాత్రమే వున్నాయి. ఎర్రగుడి - రాజుల మందిగిరి మినహా తెలుగు నేలలో అశోకచక్రవర్తి శాసనాలు ఎక్కడా అగుపించవు. కర్నాటకలోని బళ్ళారి జిల్లా ఉడేగోళం, నిట్టూరు, రాయచూరు జిల్లా మాస్కి సమీపంలోని గవిమఠం, చిత్రదుర్గం జిల్లా సిద్ధాపురం - బ్రహ్మగిరి - జతింగ రామేశ్వరం, కొప్పల జిల్లా గవిమఠం - పాల్కిగుండు ప్రదేశాల్లో అశోక చక్రవర్తి శాసనాలు ధర్మ సందేశాలను ప్రచారం చేస్తున్నాయి. సుమారు 2 వేల 280 సంవత్సరాల నుంచి మగధసామ్రాజ్యాధినేత తన శాసనాల ద్వారా ప్రజలతో మాట్లాడుతున్నాడు. అయితే అశోకుడు - వంశవివరాలు శాసనాల్లో కనిపించవు.

***కళింగయుద్ధం :*** మౌర్య సామ్రాజ్య స్థాపకుడు - చంద్రగుప్త మౌర్య (శ్రీ.పూ. 322-298) మనుమడు, బిందుసారుని (క్రీ.పూ. 298-269) కుమారుడైన అశోకుడు తండ్రి మరణానంతరం క్రీ.పూ. 269లో చక్రవర్తిగా పట్టాభిషిక్తుడయ్యాడు. అంతకుముందే అశోకుడు ఉజ్జయిని రాష్ట్రానికి ఉపరాజుగా సేవచేశాడు. ఆరాష్ట్రంలోని విదిశ నగర వర్తక ప్రముఖుడు - దేవశెట్టి కూతురు దేవిని ప్రేమించి పెండ్లి చేసుకొన్నాడు. 'అశోక-దేవి'లకు మహేంద్ర తనయ, సంఘమిత్రలు కలిగారు. (కొడుకు- కూతరు బౌద్ధ ధర్మ ప్రచారానికే అంకితమయ్యారు). అశోకునికి దేవి కాకుండా మరో నలుగురు భార్యలున్నాయి.

తాను సామ్రాజ్య పీఠాన్ని అధించిష్టించిన 8 సంవత్సరాల తర్వాత కళింగ రాజ్యాన్ని జయించానని అశోకుడు 13వ శిలాశాసనంలో పేర్కొన్నాడు. ***కళింగ రాజ్యం సర్వ స్వతంత్ర జనపదంగా వుండేది. కళింగ దేశాన్ని, మౌర్య సామ్రాజ్యంలో కలుపుకోవాలన్న చంద్రగుప్త, బిందుసార కలలునెరవేరలేదు. తన తాత-తండ్రి కన్న కలలను నెరవేర్చాలన్న తలంపుతో అశోకుడు అశేష సైన్యవాహినితో వచ్చి (నేటి ఒడిషా) ధౌళి పట్టణ సమీపంలో దయానది వద్ద ఘోరయుద్ధం చేశాడు.*** సుశిక్షితులైన అశోకుని సైనికులు వేలాది మంది సామాన్యులైన కళింగ సైనికుల చేతిలో హతమయ్యారు. కళింగులు కూడా వేలాదిమంది వీరమరణం పొందారు. కళింగదేశ అప్పటి అధిపతులు ఎవరో చరిత్రకారులు నేటికీ చెప్పలేకపోతున్నారు. కళింగ యుద్ధం క్రీ.పూ. 261 లో జరిగింది. ఆయుద్ధంలో జరిగిన ప్రాణ నష్టాన్ని చూసి - చలించి - పశ్చాత్తాపపడి - పరివర్తన చెంది చండ అశోకుడు ధర్మ అశోకుడుగా మారాడు.

***(రచయిత చారిత్రక పరిశోధకుడు)***

# దేశ చరిత్ర గతిని మార్చిన చంద్రగిరి





రాజరాజరాజేశ్వరి ఆలయం

***కార్వేటినగరం రాజు ఇమ్మడి యాదవ నరసింహరాయలు క్రీస్తు శకం 1000 సం॥లో చంద్రగిరి కోటను నిర్మించాడు. విజయనగర సామ్రాజ్య చరిత్రలో చంద్రగిరి కోట ప్రముఖ స్థానం వహించింది. శ్రీకృష్ణదేవరాయలు తిరుమలను దర్శించినప్పుడు ఇక్కడే విడిదిచేసే వాడు. అచ్యుత దేవరాయలను చంద్రగిరి కోటలో నిర్బంధించారు.***

విజయనగర సామ్రాజ్య సర్వసైనాధ్యక్షుడు అనధికార రాజు అరవీటి రామరాయలు దక్కను ప్రాంతం ముస్లింరాజుల సమాఖ్య చేతిలో క్రీ.శ. 1565 జనవరిలో రక్కసి తంగడి యుద్ధంలో కుట్రపూరిత హత్యకు గురయ్యాడు. అప్పుడు సదాశివరాయలు చక్రవర్తిగా వుండేవాడు. తిరుమల రాయలు తమ రాజధానిని పెనుకొండకు మార్చాడు. పరిపాలనా సౌలభ్యం కోసం రాజ్యం 3 విభాగాలయింది. శ్రీరంగ పట్నం, పెనుకొండ, చంద్రగిరిలు రాజధానులయ్యాయి. బ్రిటీషు ఈస్ట్ ఇండియా కంపెనీకి చెన్నపట్నంలో కోటను కట్టుకోవ దానికి క్రీ.శ. 1639 ఆగస్టు 22న అనుమతి చ్చింది. చంద్రగిరి కోటలో ఈస్ట్ ఇండియా కంపెనీ డైరెక్టర్ ఫ్రాన్సిస్ డే తొలుత వచ్చి శ్రీకాళహస్తి మండల పాలకుడు – సామంతుడు దామెర్ల వెంకటాద్రిని కలిశాడు. చెన్నపట్నం (చెన్నై) అప్పటి పేరు మైలాపురం.

మైలాపురం శ్రీకాళహస్తి మండలంలో వుండేది. 95 శాతం ప్రజలు తెలుగు మాట్లాడే వారు.

చంద్రగిరి పాలకుడు రెండో శ్రీరంగరాయలు బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీకి క్రీ.శ. 1639లో భూమి ఇచ్చినందున బ్రిటీష్ వాళ్ళు అధికారికంగా ఒక కోటను కట్టుకొన్నారు. అదే సెయింట్ జార్జ్ కోట చెన్నైలో వుంది. తర్వాత బ్రిటీష్ వాళ్ళు మొత్తం భారతదేశాన్నంతా తమ పాలన కిందకు తెచ్చుకొన్నారు. ఆ విధంగా చంద్రగిరి ఒప్పందం చేటు తెచ్చింది. రాజమహల్‌లో చక్కని మ్యూజియం వుంది. చంద్రగిరి చిత్తూరు జిల్లా తిరుపతి నుండి 12కి.మీ. దూరంలో వుంది. ప్రముఖ చారిత్రక పరిశోధకుడు – పాత్రికేయుడు శ్రీ మైనాస్వామి 2002లో 'తిరుమల చంద్రగిరి' పుస్తకాన్ని రాశారు.



సెయింట్ జార్జ్ ఫోర్ట్, చెన్నై



లక్ష్మీదేవి గుడి



# రాయల కాలానంతరం తెలుగు సాహిత్యం

■ డాక్టర్ బ్రహ్మానందరెడ్డి




***ఆంధ్రభోజుడుగా ఘనతకెక్కిన శ్రీ క్రిష్ణదేవరాయల యుగంలో సాహిత్యం మూడు పువ్వులు ఆరు కాయలుగా విరాజిల్లింది. తన సాహితీ వైభవాన్ని చాటి చెప్పే 'భువనవిజయ'పు విలువను కాపాడటానికి భూమిని పడిపోకుండా మోసే అష్టదిగ్గజాల్లాంటి కవివరేణ్యులు ఉండనే ఉన్నారు. వీరే కాక స్వయంగా రాయలవారే కత్తిని, కలాన్ని ఒకేసారి విసరగల సాహితీ సమరాంగణ సార్వభౌములు. గీర్వాణాంధ్ర భాషల్లో అద్వితీయమైన ప్రతిభ, మంచి పరిపాలనా దక్షత, వెరసి విజయనగర సామ్రాజ్యపతాక దక్షిణ భారతదేశంలో ఎగరటానికి మూలకారణాలయ్యాయి. ముఖ్యంగా సాహితీ విషయాలకొస్తే తెలుగుభాషను అమితంగా ప్రేమించిన వ్యక్తి, కన్నడకస్తూరి అని కీర్తిస్తున్నా 'దేశభాషలందు తెలుగు లెస్స' అని చాటిన తెలుగు భాషాభిమాని. ఆముక్తమాల్యద కావ్యావతారికలో ఆంధ్రమహావిష్ణువు మాటలతో తాను తెలుగు రాయుడునని సగర్వంగా ప్రకటించాడు శ్రీక్రిష్ణదేవరాయలు.***



అంతటి మేధాగరిమను సంతరించుకున్న రాయలవారి కవుల రచన ఒక్కొక్కరు ఒక శతాబ్దానికి సరిపోయేటంతటి కృషి సల్పినవారు. తమ పాండితీగరిమతో రాయలకీర్తిని దిగంతాలకు




చాటిచెప్పినవారు. రాయల యుగాన్ని 'ప్రబంధ యుగం'గా తెలుగు భాషకు స్వర్ణయుగంగా చెప్పుకోవడం పరిపాటి. కాకపోతే ప్రబంధాలను స్వీకరించటానికి ముఖ్య కారణం సంస్కృత భాష నుండి అనువదించడానికి వేరే విషయాలు ఏవీ లేకపోవడమే. అందుకే అప్పటి కవులు అష్టాదశవర్ణనలతో, పురాణేతిహాసాల నుండి స్వీకరించిన చిన్న కథను స్వకీయమైన మార్పులు చేసి పెద్ద కావ్యంగా రాయడమే ప్రబంధమయ్యింది. దాదాపుగా ఒక శతాబ్ద కాలం ఈ యుగం తిరుగులేని రాజ్యమేలింది. ప్రబంధంలో శృంగారాత్మక విషయాలుండటానికి ఆ కాలంలోని సామాజిక పరిస్థితులే కారణం. కాబట్టే ప్రబంధాలు శృంగార మయాలయ్యాయి.

శ్రీక్రిష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్య విస్తరణలో భాగంగా వివిధ కోటలను దుర్గాలను జయించి విజయస్తూపాలను నాటించారన్న సంగతి తెలిసిందే. అయితే అష్టదిగ్గజ కవులు కాకుండా రాయల ఆస్థానంలో ఎందరో విద్వత్కవులు అతని విజయాలను సాహిత్యంలో పొందుపరిచారు. అలాంటివారిలో లోల్ల లక్ష్మీధర పండితులొకరు. ఇతను క్రిష్ణదేవరాయల విజయ పరంపరను శ్లాఘించిన కీర్తి అమోఘం.

"అమిత ప్రతాప బాలార్క విస్ఫూర్తిచే
నదన గోల్పడియె నయ్యుదయ శిఖరి
భేరీధణంధణా ఘోరనాదములచే
వినుకొండ దుర్గంబు విఱిగిపడియె
వాహినీ సవుతాబు వాహోముఖంబురా
లక్కయై కరగె బెల్లంబు కొండ
క్రూర రాహుత ఖడ్గ కులిశధారల చేత
గొలసిచెట్రుపగట్టె గొండవీడు
కూలె బెజవాడ కంపించె గొండపల్లి
పగిలె గటకంబు గగ్గోలు పడియెఢిల్లి
యేక ధాటిగనీవు దండెత్తినపుడు
కీర్తితోపాయ ధౌరేయ కృష్ణరాయ"

ఇన్ని విజయాలను సాధించిన రాయలు అన్ని భాషలకు చెందిన సాహితీమూర్తులను సమరస భావంతో సత్కరించడం అతని మూర్తీమత్వానికి నిదర్శనం. అతను సకల కళావల్లభుడు అని చెప్పటానికి నిదర్శనంగా ఓ కవి చెప్పిన అద్భుతమైన పద్యం

"జంభారిగంభీర రంభాకుచస్తంభ
సంభోగగరిమ నీ సమరమహిమ
చింతామణి క్రాంత సంతాన నిశ్రాంత?
శాంతికరంబు నీ సత్యకీర్తి
ధాటీ సమారంభ భేటీ రణభేరి?
భేరీరవంబు నీ భీమగరిమ
చండోగ్ర దండమై ఖండించురిపునసి
ఖండించువైచు నీ ఖడ్గధార
చంద్రచందన మందార చారురుచిర

కుటిలగోక్షీర సురరాజ కుంతనముల
నవఘళించు నీకీర్తి యఖిలదిశల
కీర్తి రాధేయ నరసింహ కృష్ణరాయ"

ఇంతటి వైభవాన్ని చవిచూచిన విజయనగర సామ్రాజ్యం కృష్ణదేవరాయల అనంతరం తిరోగమనం చెందింది. అప్పాజీ కళ్ళు పీకించినందుకు అతని కుమారులు తిరుగుబాటు లేవనెత్తడంతో రాజ్యంలో అల్లకల్లోలాలు ప్రారంభమయ్యాయి. రాజ్యం కోసం రాయల సవతి తమ్ముడు అత్యుత దేవరాయలు, అల్లుడు అరవీటి (అళియ) రాయరాయలూ పెనుగులాడారు. అచ్యుత రాయలు మొదట అంగీకరించకున్నా తరువాత రాయరాయలతో సంధిచేసుకొని కొంత భాగం పంచుకొని పాలించారు. క్రీ.శ.1542లో అచ్యుత రాయలు చనిపోవడంతో అళియరామరాయలు మొత్తం రాజ్యాన్ని స్వాధీనపరుచుకొని పేరుకు సదాశివరాయలకు పట్టంకట్టి పరిపాలన సాగించాడు. రాయల మరణానంతరం రాజ్యంలో ఒక రకమైన నిస్తేజం, నిస్సత్తువ ఏర్పడిందనే అనాలి. రాయల కాలంలో అందలమెక్కినవారు అధ:పాతాళానికి పడిపోయారు.

చిన్నప్పుడు అష్టకష్టాలు పడిన తిమ్మరసు, ప్రాణపాయగండాన్నుండి గట్టెక్కించి, సువిశాల సామ్రాజ్యానికి రాయలను రాజునుచేస్తే, వంద సంవత్సరాల వయసులో కళ్ళు పీకేయించబడుతాడు. తన మాటే శాసనంగా బ్రతికిన తిమ్మరసు వృద్ధాప్యంలో నానా అగచాట్లుపడ్డాడు. తన రాజును స్వర్గానికి పంపిన తిమ్మరసు తాను నరకప్రాయమైన జీవితాన్ని గడిపాడు. రాయలతోపాటు తిమ్మరసు కూడా తిరుమలకు ఎన్నో దానాలు చేశాడు. "దానికి ప్రతిగా తిరుపతి దేవాలయంవారు ఏటా తిమ్మరసు వారికి ప్రసాదాలు పంపేవారు. రాయల నిర్యాణానంతరం పట్టించుకొనే నాథుడు లేక, దినం జరుగక తిరుపతి దేవస్థానం వారు యిచ్చే ప్రసాదాలను అమ్ముకొని బ్రతకాల్సిన పరిస్థితి ఏర్పడటం శోచనీయం. రాయలు చనిపోయిన ఆరు సంవత్సరాల తరువాత అప్పాజీ చనిపోయారు.

అదే విధంగా రాయలు అమితంగా ప్రేమించిన అల్లసాని పెద్దన కోకటం అగ్రహారానికి చేరుకొన్నాడు. రాజు తనకిచ్చిన గౌరవాన్ని తలచుకుంటూ కుమిలిపోయాడు. తనకు ఆనాడు జరిగిన గౌరవాలను స్మరిస్తూనే, తన దీన పరిస్థితిని ఇలా వివరించాడు.

"ఎదురైనచో దన మదకరీంద్రము నిల్పి
కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొనువేళ బురమేగ
బల్లకి దనకేలబట్టి యెత్తి
గోకట గ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగిన సీమలయందునిచ్చె
బిరుదైన కవిగండ పెండేరమునకీవ
తగుదని తానె పాదమున దొడగె
ఆంధ్రకవితాపితామహ అల్లసాని
పెద్దనకవీంద్రయని తన్ను బిల్చునట్టి
కృష్ణదేవరాయలతో దివికేగలేక "
బ్రతికియున్నాడు జీవచ్ఛవంబనగుచు

అని తన దుస్థితికి బాధపడతాడు. రాయల నిర్యాణాంతరం కేవలం తురుష్కులు మాత్రమే దండయాత్రలు సాగించలేదు. పిల్లనిచ్చిన వారు కూడా దండయాత్ర చేయడం గమనార్హం. గజపతులు కన్నడరాజ్యంపైకి దండెత్తివస్తే పెద్దన రాసిచ్చిన సీసపద్యాన్ని చదివి సిగ్గుపడి వెనుతిరిగి వెళ్ళిపోతాడు. ఆ పద్యం..

"రాయరాహుత మిండ రాచయేనుగు వచ్చి
యార్లకోట గోరాడు నాడు
సంపెట నరపాల సార్వభౌముడు వచ్చి
సింహాద్రి జయశిల జేర్చునాడు
సెలగోలు సింహంబు చేరి ధిక్కృతిగంచు
తల్పుల గరుల డీకొల్పునాడు
ఘనతర నిర్భర గండపెండెరమిచ్చి
కూతురాయల కొనగూర్చునాడు
ఒడలెఱుంగవొ, చచ్చితొ, యుర్విలేవొ
చేరజాలక తలజెడి జీర్ణమైతొ
కన్నడంబెట్లు సొచ్చెదు గజపతీంద్ర
తెఱచి నిలు కుక్కసొచ్చిన తెఱగు దోప"

తెరచివుంచిన ఇంటిలోనికి కుక్క దూరడం గొప్పకాదు. రాయలు బ్రతికున్నప్పుడు మీ ప్రతాపం చూపెట్టి ఉంటే బాగుండేదని పద్యముఖమతా చీవాట్లు పెడతాడు పెద్దన.

అలాగే మహాకవి ధూర్జటి తన స్వగ్రామం శ్రీకాళహస్తికి చేరుకుంటాడు. అందరు కవులు తమ తమ నెలవులు తప్పాయని తెలుసుకొని మెల్లగా జారుకుంటారు. ***అళియరామరాయలు నమ్మి దగ్గరకు చేరదీసి పెంచిన మల్కిభరాముడుగా పేరు తెచ్చుకున్న ఇబ్రహీం చేసిన ద్రోహానికి బలైపోతాడు. ఎవరి సుస్థిరత కోసం తన సామ్రాజ్యంలో అనేక మసీదులు, హిందువులతో సమానంగా ఆంతరంగిక, రక్షక ఉద్యోగాలిచ్చాడో వారి చేతుల్లో, మోసపోయి తలకొట్టేయించుకుంటాడు.*** 1565లో జరిగిన రక్షసి-తంగడి యుద్ధంలో రామరాయలు చంపబడ్డాడు. ఇతడు మరణించిన తర్వాత ఇతని తమ్ముడు తిరుమల దేవరాయలు పలాయనం చిత్తగిస్తూ 1500 ఏనుగుల మీద రత్నరాసులను తీసుకొని, సదాశివరాయలతో కలిసి పెనుకొండ దుర్గం చేరుకుంటాడు. తురకలు ఆరు నెలల పాటు విజయనగరాన్ని కొల్లగొట్టడమేకాక తగులబెట్టడానికి వీలున్న వన్నింటిని తగులబెట్టారు. ఆరునెలల తర్వాత తిరిగివచ్చిన రాజును తమ రాజుగా పౌరులు తిరస్కరిస్తారు. తిరిగి పెనుకొండకు వెళ్ళి సదాశివ రాయలను ప్రక్కకు తోసి తిరుమల దేవరాయలనే పేరుతో పరిపాలన సాగిస్తాడు. ఇతని ముగ్గురు




కుమారులు సామ్రాజ్యాన్ని మూడుముక్కలు చేసి పరిపాలన సాగిస్తారు. శ్రీరంగదేవరాయలు పెనుకొండకు, శ్రీరామరాజు శ్రీరంగపట్టణం, వెంకటపతి రాయలు చంద్రగిరి కోటకు రాజులయ్యారు.

వీరి పరిపాలనా కాలంలో కవులు, సాహితీకారులున్నప్పటికీ కృష్ణదేవరాయల కాలంలో తెలుగు వెలుగులు జిలుకరించినట్లు లేదు. దాదాపుగా 100 సంవత్సరాలు తెలుగు సాహితీమ తల్లి నిరాదరణకు గూరై నానా అగచాట్లు పడిందనడంలో సందేహం లేదు. తురుష్కుల దండయాత్రలతో వారి దోపిడీలతో దేవుళ్ళకే నిలువనీడ లేక పోయిందంటే సాహిత్యమో లెక్కనా? అన్నట్లుండేది. అలాంటి తరుణంలో తెలుగు తల్లి తనను తను కాపాడుకోవడానికి నాయక రాజుల చెంతకు చేరి మళ్ళీ తన పూర్వవైభవాన్ని సంతరించుకుంది. తన సాహితీ గుభాళింపును మరింతగా సంతరించుకొని శృంగారనాయికలా తన అందచందాలతో ఆబాల గోపాలాన్ని ఆనందపరశుల్ని చేసింది. రాజులు పోయారు, రాజ్యాలు పోయాయి కానీ సాహితీ మూర్తులు, సాహిత్యాన్ని కాచిన రాజులు సాహిత్యం బతుకున్నంతవరకు బతికేవుం టారు. సాహితీ విద్యార్థుల నాలుకలపై నర్తిస్తూనే వుంటారు. తన తెలుగు లక్ష్మి సోయగాలను చూసి రాయలు సంతోషిస్తూనే వుంటాడు.


(రచయిత పోస్ట్ డాక్టొరల్ ఫెలో
– తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి).

# తిరుమల గిరుల విశిష్టత

■ *గుండ్లపల్లి శివకుమార్*



***శ్రీవేంకటేశ్వరుడు తిరుమల గిరిపై వెలిశాడని వామన పురాణం తెలుపుతున్నది. కలియుగంలో ప్రజలు పారమార్థిక చింతనలేక స్వార్థపూరితులుగా వుంటారని, అందుకు స్వామివారు తిరుమల గిరుల్లో నిలిచాడు. ఆర్తత్రాణ పరాయణుడుగా మానవాళికి ముక్తి ప్రధాతగా వుండాలని బ్రహ్మకోరాడు. అందుకు అంగీకరించి స్వామివారు సప్తగిరులపై కలియుగాంతం వరకు నిలిచి వుంటానని అంగీకరించాడని బ్రహ్మాండ పురాణం, బ్రహ్మవిర్భావ పురాణంలో తెలుపబడింది.***

***వైకుంఠంలో ఒకప్పుడు వాయుదేవునికి, సహస్ర శిరుల ఆదిశేషునికి ఒక చిన్న వాగ్వివాదం జరిగిం దట. అపుడు ఆదిశేషువు ఒకనోరు తెరిచి మేరు పర్వతంపై గల ఒక శిఖరాన్ని నోట కరుచు కొన్నాడు. ఆ శిఖరాగ్రాన్ని తన హాలాహలంతో పేల్చివేయాలని అనుకొన్నాడట. వాయువు మహోగ్రంగా సుడిగాలిని సృష్టించి వైకుంఠాన్ని పెకలించేలా చేశాడట. అప్పుడు ఇంద్రాది దేవతలు ఆదిశేషుని ప్రార్థించి వెనుకకు తగ్గమని వేడుకొన్నారు. శేషుడు ఆ విధంగా విరమించు కొనే ప్రక్రియలో ఒక శిఖరభాగం బద్దలయి భూమిపై పడందని అలా శేషుని కారణంగా పడిన ఆ పర్వత భాగం శేషాచలంగా ప్రసిద్ధి పొందింది.***

పశ్చాతాప చిత్తంతో ఒక బ్రహ్మణుడు ఒక మనిషిని కలిసి ప్రాయశ్చిత్తోపాయం చెప్పమని అర్థించాడట. రుషి ఆదేశానుసారం యాత్రకు ఉపక్రమించి శేషాచల పర్వతాలకు వచ్చాడట. వెంటనే అతని శరీరం భగ్నమయ్యింది. కొన్ని క్షణాల తర్వాత ఆ బ్రహ్మణుడు కనిపించాడు. ముందుకంటే మరింత తేజస్సు గల శరీరాన్ని పొందాడు. ఈ సంఘటనలను గమనించిన రుషులు దేవతలు ఈ పర్వతాన్ని సర్వపాపములు నశింపచేసింది. కనుక దీనిని వేంకటాద్రి అని పిలిచారని వరాహపురాణం ఒకటవ అధ్యాయంలో పేర్కొన్నారు.

శేషాచలం పర్వత శ్రేణులను అనేక పేర్లతో పిలిచేవారని బ్రహ్మపురాణం, బ్రహ్మనంద పురాణాలలో తెలియజేయబడింది.

వృషభాసురుని వధించిన శ్రీవేంకటేశ్వరుడు ఆ రాక్షసునికి ఒక వరమిచ్చాడనీ, ఆ ప్రకారం వారి పేరుతోనే ఈ కొండకు వృషభాద్రి అనే పేరు వచ్చిందంట. అనేక పుణ్యతీర్థాలు కొండలపై ఉన్నందున ఈ కొండలను శేషాద్రి అని పిలుస్తారని తెలుస్తున్నది.

గరుడుడు శ్రీవారి క్రీడలకుగాను ప్రత్యేకంగా ఈ పర్వతాన్ని వైకుంఠం నుంచి తెచ్చాడుగాన దీనిని గరుడాద్రి అంటారు.

నరసింహస్వామి స్వయంగా ఆవిర్భావమయిన కొండ కనుక దీనిని 'నరసింహాద్రి' అని కూడా అంటారు.

అంజనాదేవి తప: ఫలంగా ఆంజనేయుడు జన్మించినందున, తిరుమల కొండలను అంజనాద్రి అంటారు.

తిరుమలలో మూడున్నర కోట్ల తీర్థాలున్నట్లు ప్రతీతి. వాటిలో ముఖ్యమైనవి. కుమారధార, తుంబురకోన, కటాహతీర్థము, ఆకాశగంగ, పాప వినాశం, శేషతీర్థం, చక్రతీర్థం, పాండవతీర్థం, స్వామి పుష్కరిణి, గోగర్భం, భరద్వాజ తీర్థం, వైకుంఠ తీర్థం, అస్థి తీర్థం, శంఖాది తీర్థం, యుద్ధానిరస్థ రసాయన తీర్థం, బ్రహ్మతీర్థం, విష్వక్సేన తీర్థం, ఇందిరా తీర్థం, కపిలధారతీర్థం, వజ్రతీర్థం. పంచతీర్థం, ఆగ్నేయతీర్థం, వామన తీర్థం.

మార్కండేయ పురాణం, గరుడ పురాణం, భవిష్యోత్తర పురాణం, స్కంద పురాణం, బ్రహ్మాండ పురాణంలలో స్వామి పుష్కరిణి, తిరుమల తీర్థాల ప్రాముఖ్యతను పేర్కొనడం జరిగింది.

అనేక యుగాల ముందు ధశదథ మహారాజు అశ్వద్ధవృక్షం క్రింద ఈ క్షేత్రంలో (స్వామి పుష్కరిణి) గట్టున పుత్రార్థియై తపస్సు చేశాడనీ, కుమారస్వామి కుమారధార తీర్థంలో తపస్సు చేశాడనీ, అగస్త్యాది మహారుషులు తిరుమల క్షేత్రంలో ఘోర తపస్సు చేసి సిద్ధి పొందారనీ మార్కండే పురాణం, వామన పురాణం, వరాహ పురాణాల్లో విశదీకరించారు.

సాక్ష్యాత్తూ ఆదిశేషుడే కొండగా అవతరించి 'శేషాచలంగా' పిలువబడే తిరుమలగిరులపై



గోగర్భంలో వెలసిన
క్షేత్రపాలకుడు శివుడు



కుమారధార తీర్థం

తలభాగాన శ్రీవేంకటేశ్వరుడు నిలిచాడనీ, నడుము భాగాన అహోబిలం నరశింహుడు అవతరించాడనీ, తోక భాగాన శ్రీశైల మల్లిఖార్జునుడు నిలిచాడనీ బ్రహ్మాండపురాణం - 2వ అధ్యాయంలో, పద్మపురాణంలోని 28 నుంచి 31 అధ్యాయాల్లో వివరించబడ్డాయి. మూడు ప్రదేశాల్లో ఈ గిరి



చక్రతీర్థం

శ్రేణులలో ముగ్గురు మహాదేవులు ఆవిర్భవించి మానవాళికి ముక్తిని ప్రసాదిస్తున్నారు.

ఆది శేషుడే మూర్తీభవించిన శేషాచలం. వేయి పడగల నిశ్వాసాలు హాలాహల సమంగా వుంటాయి.

తిరుమల పర్వత శ్రేణుల్లో ఎందరో రుషులు ఆశ్రమాలు యేర్పాటు చేసుకొని తమ జీవితాలను గడుపుకొంటూ ముక్తి మార్గాంలో పయనించారు. వీరి ఆశ్రమాలకు అతి సమీపంలో అనేక పుణ్య తీర్థాలున్నాయి. ఈ పుణ్య జలాలలో జవ-తపాదులు, స్నానపానాదులు నిర్వర్తించుకొని వారు భగవత్ సేవలో తరించారు.

స్వర్ణముఖినది శేషాచలం కొండల్లో పుట్టి దిగువగా ప్రవహిస్తూ వుంది. సాక్ష్యాత్తు గంగనదే ఈ విధంగా ఇక్కడ రూపాంతరం చెందిందని స్కందపురాణంలో 7వ అధ్యాయంలో వుంచి మేరు పర్వత బంగారు శిఖరం



తిరుమల కొండలో నంది ఆకారం

ఈ నదికి జన్మస్థానం కాబట్టి దీనిని స్వర్ణముఖి అని అంటారు. ఈ నదికి సమారు 5మైళ్ళ దూరంలో అగస్త్య మహాముని ఆశ్రమం వుండేది. ఆయన ఈ నదీతీరంలో శివలింగ ప్రతిష్ఠ చేసినందున అగస్తేశ్వర ఆలయంగా తొండవాడలో ప్రసిద్ధి చెందింది. తొండవాడ తిరుపతి - చంద్రగిరి మార్గ మధ్యంలో ఉంది.

పరాశర మహాముని ఆశ్రమం కూడా స్వర్ణముఖీ నదీ తీరంలో వుండేది. ఆయన పరాశరేశ్వర లింగ స్థాపన చేసి నిత్యార్చనలు జరిపేవారట. వీరిరువురిని అనుసరించి అనేక మంది రుషులు ఈ పరిసరాల్లో ఆశ్రమాలు యేర్పరుచుకొని తపస్సు చేసి మోక్షం పొందారని పురాణాలు తెలుపుతున్నాయి. ఆ విషయాలు మార్కండేయ పురాణంలో స్కంద పురాణంలో కనిపిస్తాయి. 'యోగిమల్లవరం' పేరు ఈ విధంగానే వచ్చిందట. శుక్రబ్రహ్మముని శ్రీకృష్ణ - బలరామ విగ్రహాలు ప్రతిష్టించి పూజాధికాలు చేశారని శుక ముని ఆశ్రమ ప్రాంతంగాబట్టి ఈ ప్రదేశానికి శ్రీ శుకపురం అనీ తరువాత తమిళభాషాపరంగా తిరుచాకపురంగా తర్వాత తిరుచానూరు అయ్యింది. నేటికీ తిరుచానూరు ఆలయంలో శ్రీ బలరామ



తుంబురు తీర్థం

శ్రీకృష్ణ ఆలయం ఉంది. పద్మసరోవరం- పరమ పుణ్యతీర్థం, ఇది కోనేరుగా ప్రస్తుతం రూపాంతరం చెందింది. పద్మ సరోవరం స్వర్ణముఖి నదికి అతి సమీపంలో ఉంది. వినా వేంకటేశం- ననాథో - ననాథః సదా వేంకటేశం - స్మరామి స్మరామి హరే వేంకటేశం ప్రసీధః - ప్రసీధః ప్రియం వేంకటేశం - ప్రయచ్ఛ - ప్రయచ్ఛ.

(కొత్త పత్రిక ఆగస్టు 2006 సంచిక సౌజన్యంతో)



తిరుమలలో సహజసిద్దంగా వెలసిన శిలాతోరణం



జపాలీ తీర్థంలోని ఆంజనేయ స్వామి దేవాలయం

# 15వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

























ప్రముఖ జర్నలిస్ట్
మరియు రచయిత
'పర్యాటక రత్న'
**శ్రీ మైనాస్వామి**
సంపాదకత్వంలో పర్యాటక రంగ
విశేషాలపై వెలువడుతున్న
**టూరిజం న్యూస్**
15వ వార్షికోత్సవం
జరుపుకొంటున్న
సందర్భంగా
హార్థిక శుభాకాంక్షలు.

**Dr.S.RAJESHWAR RAO,** *Principal (Rtd.)*
*Bhavan's New Science College*
*Narayanaguda, HYDERABAD . Cell : 9866860004*

**Dr.D.VASUNDHARA,** *Principal*
*Dr.B.R.Ambedkar Junior College*
*Bagh lingampally, HYDERABAD.*

## తెలంగాణ చరిత్ర పుటల్లో

# దోమకొండ సంస్థానం

**తెలంగాణ సంస్కృతి సంప్రదాయాలు, వైభవం, నాగరికత మొదలైన వాటి గురించి తెలియజేసేవాటిలో కోటలు ప్రముఖమైనవి. కోటల్లో అప్పటి రాజులు రాయించిన శాసనాలు, వాడిన నాణాలతో పాటు వారు సాగించిన పాలన, శత్రుదుర్భేద్యంగా నిర్మించిన రాతి గోడలు, అబ్బురపరిచే నిర్మాణశైలి వంటి విషయాలు కోటల ద్వారా తెలుస్తాయి. రాజవంశీయులు తెలంగాణ వారి ఆచార వ్యవహారాలు, కళాపోషణ, నాటి శిల్పకళావైభవం... గత చరిత్రకు సాక్షీభూతంగా నిలిచాయి. అయితే ఇప్పుడు చాలా వరకు కోటలు శిథిలావస్థలో వున్నాయి. కొన్ని కోటలుపర్యాటక కేంద్రాలుగా మారి పర్యాటకులకు ఆహ్లాదాన్ని పంచుతున్నాయి. తెలంగాణ సంస్థానాల్లో దోమకొండ సంస్థానం ప్రసిద్ధి పొందింది.**



దోమకొండ కామారెడ్డి జిల్లాలో వుంది. పాకనాటి రెడ్డిశాఖకు చెందిన కామినేని వంశస్థులు ఈ సంస్థానాధిపతులు. ఈ సంస్థానానికి బిక్కనవోలు (మెదక్ జిల్లా) సంస్థానమని కూడా నామాంతరం కలదు. ఈ సంస్థానాధీశులు తొలుత గోల్కండ సుల్తానులకు, ఆ తరువాత అసఫ్ జాహీలకు సామంతులుగా వచ్చి చేరారు. దోమకొండ కేంద్రంగా కాసాపురం, సంగమేశ్వరం, మహ్మదాపురం, విస్సన్న పల్లి, బాగోత్‌పల్లి, కుందారం, పాల్వంచ, దేవునిపల్లి వంటి నలభై గ్రామాలను పాలించారు. 19వ శతాబ్దంలో ఈ సంస్థానపు సంవత్సర ఆదాయం రెండు లక్షల రూపాయలు. అందుకే దోమకొండ కోశాగారానికి కాపలాగా ఇరవై మంది అరబ్బులు ఉండేవారట. వీరు రెడ్డి దొరలైనప్పటికీ నిజాం ప్రభువులు వీరికి రావుబహద్దూర్ అనే బిరుదు ఇవ్వడంతో కొంతమంది పాలకుల పేరు చివర రావు అన్నపేరుతో చలామణి అయ్యారు.

1636లో అబ్దుల్ హుస్సేన్ కుతుబ్ షా కామారెడ్డికి ఈ సంస్థానాన్ని ఇచ్చాడు. ఈ ప్రాంతంలోని అనేక గ్రామాలు వారి వంశీయుల పేర్లయిన కామారెడ్డి, సంగారెడ్డి, ఎల్లారెడ్డి, మాదారెడ్డి, సదాశివనగర్, పద్మాజివాడి, తుక్కోజివాడి, తిమ్మోజివాడిల మీదనే వెలిశాయి. ఈ వంశానికి చెందిన రాజన్న చౌదరి 1760 కాలంలో రాజధానిని బిక్కనవోలు నుండి కామారెడ్డిపేటకు, ఇతని కుమారుడు రాజేశ్వరరావు కాలంలో కామారెడ్డి పేట నుండి దోమకొండకు మారింది. అప్పుటి నుండి దోమకొండ సంస్థానంగా ప్రసిద్ధి చెందింది. కోట, అద్దాల బంగళా, రాజభవనాలు, అశ్వ-గజ శాలలు, కుద్యాలు, బురుజులు, కందకం పర్యాటకులకు ప్రధాన ఆకర్షణ. ఈ అద్దాల మేడలోనే కామినేని వంశీయులు సాంస్కృతిక కార్యక్రమాలు జరిపించేవారు. పురావస్తు శాఖ ఆధ్వర్యంలో పునర్నిర్మాణ పనులు జరిగాయి. సంపదను కాపాడుకున్నట్లయింది.

దోమకొండ కోట నలభై ఎకరాల విస్తీర్ణంలో చుట్టూ రాతి కట్టడంతో ప్రహరీగోడతో పాటు బయటివైపు నుంచి శత్రువులు రాకుండా ఉండేందుకు నిజాం రాజుల కోటలాగా మొత్తం గోడ చుట్టూ నీటి కందకం వుంది. తెలంగాణ జిల్లాల్లోని


మహాదేవుని గుడి



మరే గడీ చుట్టూ ఇలాంటి నీటి కందకం లేదు. సంస్థానాధీశుల మహల్లను గడీలంటారు. రక్షణకి కేవలం అధికార దీవీని ప్రకటించే భవనాలు. కోటలో ప్రవేశించేందుకు పడమర వైపు ఒక పెద్ద కమాన్, తూర్పువైపు మరొకటి వున్నాయి. విశాలమైన ప్రాంగణం మధ్యలో సంస్థానాధీశుల ప్రధాన నివాసం వెంకట భవనం రాజసం ఉట్టిపడేలా కనిపిస్తుంది. భవనం పైభాగం లోని పాలరాతి ఫలకంపై వెంకట భవనం అని తెలుగులో, ఉర్దూలో రాసి ఉంది. ఆ కాలంలోనే ఈ భవనంపై పిడుగులు పడకుండా నిరోధించే పరికరాన్ని బిగించారు.

కోట నలభై ఎకరాల చుట్టూ నీటి కందకంతో పాటు కామినేని వంశస్థులే ఎత్తయిన రాతి గోడను నిర్మించారనీ కొందరంటే, కాకతీయులు ఆ గోడను నిర్మించగా సంస్థానాధీశులు అందులో భవనాలు కట్టుకొన్నారని కొందరంటారు. కోటలో మహాదేవుని గుడి ఉండడమే కాకతీయులు నిర్మించారనడానికి నిదర్శనమని భావిస్తారు. అయితే ఈ కథనానికి ఆధారాలేవీ లేవు.

***నగారా భవంతి:*** కోటలో నగారాను వినిపించడం కోసం ప్రత్యేకంగా ఒక భవంతిని నిర్మించారు. ఆ భవంతిపైన ఒక నీటి తొట్టెను ఏర్పరచి, దాంట్లో ఒక గిన్నెకి రంధ్రం చేసి ఉంచేవారట. తొట్టెలోని నీరు గిన్నెలోకి నిదానంగా చేరి మునిగిపోయేది. దీని ఆధారంగా సమయాన్ని చెప్పేవారట. తెల్లవారు ఝామున నాలుగు గంటల నుండి నగారా మోగించేవారట. ఇది కూడా శుక్ర, ఆది వారాల్లో ప్రతి మూడు గంటల కొకసారి, మిగతా రోజుల్లో ఆరు నుండి పన్నెండు గంటలకొకసారి మోగించేవారట.

***రాజదర్బార్ :*** కోటలలో నగారా భవంతి



కెదురుగా అతిపెద్ద రాతిగోడ, చివర్లో ఎత్తయిన బురుజులు ఉన్నాయి. గోడకు ఉన్న అతి పెద్ద దర్వాజాకు శత్రువులు ఏనుగులపై వస్తే... అడ్డుకోవడానికి అనేకమైన ఇనుప శూలాలను బిగించారు. అలాగే దర్వాజాపైన గల రంధ్రాల్లోంచి సలసల కాగే నూనెను పోసే ఏర్పాటు కూడా చేసుకొన్నారు. దర్వాజా దాటి లోపలికి వెళ్లే వచ్చే అందమైన భవంతే రాజ దర్బారు. అందులోనే హరికథలు, పురాణాలు, కవితాగానాలు, నృత్యాలు జరిగేవట. ఆ భవంతిపైన దాసీలు నృత్యం చేయడానికి వేదిక కూడా ఉంది. ఈ కోటలో కూడా దాసీ వ్యవస్థ ఉండేదట. అద్దాల మేడ ముందు రాణి మహల్ వుంది. పూర్తిగా శిథిలమయింది.

కామినేని వంశంలో అయిదవవాడైన మొదటి ఎల్లారెడ్డి కాలం నుంచి సంస్థానంలో సాహితీ వికాసం జరిగింది. ఇతని కాలంలో సంస్థానంలో పలువురు కవులుండేవారు. ***మొదటి ఎల్లారెడ్డి మనుమడైన రెండవ కాచిరెడ్డి కాలాన్ని సాహితీ స్వర్ణయుగంగా పేర్కొంటారు. మూడవ కాచిరెడ్డి కుమారుడైన మల్లారెడ్డి స్వయంగా కవియే కాకుండా పద్మపురాణోపరి భాగాన్ని అనువదించారు. మల్లారెడ్డి సోదరుడైన రెండవ ఎల్లారెడ్డి కూడా వాసిష్ఠము, లింగ పురాణం అనే గ్రంథాలు రాశాడట.***

బహుభాషా విద్వాంసులైన మూడవ రాజేశ్వర రావు ఉర్దూ, పార్సీ, అరబ్బీ భాషల్లో చిరస్థాయిగా నిలిచే రచనలెన్నో చేశారు. ఆయన ఆధ్వర్యంలో పలు నిఘంటువులు, సంకలనాలు వెలవడ్డాయి. ఆయన 'అజ్గర్' అనే కలం పేరుతో రాసేవారు. దోమకొండ కోటకు తిరుపతి వేంకటకవులు కూడా వచ్చే వారట. దోమకొండ సంస్థానాధీశుల పాలనకు మెచ్చి నిజాం రాజు హైదరాబాద్‌లోని నాంపల్లి దగ్గర ఉమాబాగ్ అనే 30 ఎకరాల తోటను బహుమతిగా ఇచ్చాడు.

*(వికీపీడియా సౌజన్యంతో)*


వెంకట భవనం



# దంతేశ్వరి దేవాలయం



***దంతేశ్వరి దేవాలయంలో దంతేశ్వరి దేవత కొలువుదీరి భారతదేశంలోని 52 శక్తిపీఠాలలో ఒకటిగా ప్రసిద్ధి పొందింది. ఈ దేవాలయం చాళుక్య రాజులచే నిర్మిచంబడింది. దంతేశ్వరి దేవి నెలకొన్న ప్రాంతం కనుక గ్రామానికి దంతెవాడ అని పేరు వచ్చింది. ఈ దేవత బస్తర్ జిల్లా వాసులకు కులదైవం. చారిత్రక ఇతిహాసాల ప్రకారం సత్యయుగంలో దక్షుని యజ్ఞం వద్ద సతీదేవి తన భర్తకు అవమానం జరిగినదని యజ్ఞ గుండంలోకి ప్రవేశిస్తుంది. దానికి శివుడు సతీదేవి దేహంతో శివతాండవం చేస్తున్నప్పుడు సతీదేవి దంతాలు పడిన ప్రాంతం కనుక శక్తిపీఠం కొలువైనట్లు కథనం. ఈ ప్రాంతంలో శంకిని మరియు ఢాకిని అనే పుణ్య నదులున్నాయి. ఈ రెండు నదులు వివిధ రంగులతో ఉంటాయి. ఇది ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలోని జగదల్‌పూర్ తెహసీల్ నుండి 80 కి.మీ. దూరంలో గల దంతెవాడ వద్ద ఉంది.***

ప్రతి సంవత్సరం దసరా సందర్భంగా వేలాది గిరిజనులు వివిధ గ్రామాలు మరియు అడవుల నుండి దంతెవాడ చేరి ఈ దేవతా విగ్రహాన్ని బయటకు తీసి పట్టణం చుట్టూ ఊరేగిస్తారు. ప్రస్తుతం 'బస్తర్ దసరా' పండగ ప్రాముఖ్యత గల పర్యాటకుల ఆకర్షణగా నిలిచింది. నవరాత్రి సందర్భంగా జ్యోతి కలశాన్ని వెలిగించడం అనాదిగా వస్తున్న ఆచారం. దంతెవాడ గ్రామం జగదల్ పూర్‌కు దగ్గరలో వుంది. ఈ ప్రాంతంలో శంకిని మరియు ఢాకిని అనే పుణ్య నదులున్నాయి. ఈ రెండు నదులు వివిధ రంగులతో ఉంటాయి. భారత దేశంలో ప్రాచీన చారిత్రిక స్థలాలలో దంతెవాడ ఒకటి. బస్తర్ ప్రాంతంలో మత, సామాజిక, సాంస్కృతిక చరిత్రలో ఒకటిగా ఈ ప్రాంతం నిలుస్తుంది. భారత సాంస్కృతిక చరిత్రలో అనేక శతాబ్దాల పాటు ఈ దేవాలయం ఒక వెలుగు వెలిగింది.

బస్తర్ దసరా వేడుకలకు 500 సవంత్సరాల చరిత్ర ఉంది. మహారాజ పురుషోత్తం దేవ్ కాలంలో ఈ వేడుకలు ప్రారంభమయ్యాయి. కాకతీయులే ఇక్కడ దంతేశ్వరీ దేవి విగ్రహాన్ని ప్రతిష్టించినట్లు కూడా కథనాలు వాడుకలో వున్నాయి. ఇక్కడ జరిగే 90 రోజుల వేడుకల్లో ముఖ్యంగా చెప్పుకోవలసింది చివరి పదిరోజుల గురించి. ఆ పది రోజుల కాలంలో రాజు అధికారికంగా ప్రధాన పూజారిగా మారుతాడు. రాజరికాన్ని వదిలి పూర్తిగా దంతేశ్వరీ పూజలోనే గడుపుతాడు. అయితే తాత్కాలికంగా రాజరికాన్ని వదిలి పెట్టినప్పటికీ వేగుల ద్వారా



ఎప్పటికప్పుడు సమాచారాన్ని తెప్పించు కొంటాడు. పూజల సమయంలో రాజు ఉపవాస దీక్షను పాటిస్తాడు.

ఒకప్పుడు దక్షుడు బృహస్పతి యాగం చేసినప్పుడు అందరినీ ఆహ్వానించాడు. కూతురు, అల్లుడుని పిలువలేదు. ఎందుకంటే దక్షుని కుమార్తె సతీదేవి (దాక్షాయణి) తండ్రి మాటకు విరుద్ధంగా శివున్ని పెళ్ళాడింది. పుట్టింటివారు ప్రత్యేకంగా పిలవాలేమిటి? అని సతీదేవి, శివుడు వారించినా వినకుండా, ప్రమధగణాలను వెంటబెట్టుకొని యాగానికి వెళ్ళింది గాని, అక్కడ అవమానానికి గురయ్యింది. ముఖ్యంగా శివనింద సహించలేక ఆమె యాగాగ్నిలో భస్మమైంది. ఆగ్రహించిన శివుడు తన గణాలతో యాగశాలను ధ్వంశం చేశాడు. కాని సతీ వియోగ దుఃఖం తీరని శివుడు ఆమె మృత శరీరాన్ని అంటిపెట్టుకొని ఉండి తన జగద్రక్షణా కార్యాన్ని మానివేశాడు. దేవతల ప్రార్థనలు మన్నించి విష్ణువు సుదర్శన చక్రంతో ఆ దేహాన్ని ఖండాలుగా చేసి, శివుడిని కర్తవ్యోన్ముఖుడిని చేశాడు. సతీదేవి శరీర భాగాలు పడిన స్థలాలు శక్తి పీఠాలుగా భక్తులకు, ముఖ్యంగా తంత్రసాధకులకు ఆరాధనా స్థలాలు అయ్యాయి. ప్రతి శక్తి పీఠంలోను దాక్షాయణీ మాత భైరవుని (శివుని) తోడుగా దర్శనమిస్తుంది. సతీదేవి దంతాలు పడిన ప్రాంతం కనుక దేవతను దంతేశ్వరి అని పిలుస్తున్నారు. దంతేశ్వరి మాత విగ్రహం నల్లని రాయితో చెక్కారు. గర్భగుడి ముఖమండం, మహామండపం, సభ మండపంగా విభజించబడింది. గర్భాలయం, మహా మండపాలను రాతితో నిర్మించారు. దేవాలయ ప్రవేశం ముందు ఒక గరుడ స్తంభం వుంది. విశాలమైన ప్రాంగణం చుట్టూ పెద్ద గోడలున్నాయి. శిఖరం విగ్రహాలతో అలంకరించ బడింది.





# మరాఠా పౌరుషానికి ప్రతీక రాయ్ ఘడ్ కోట

■ నోముల నర్మదా రెడ్డి





***చత్రఫతి శివాజీ గురించి మనం చిన్నప్పటి నుండి చదువుతూనే ఉన్నాం. వీరత్వానికి ప్రతీకగా కొలుచుకునే చత్రపతి శివాజీ మరాఠా రాజ్య స్థాపకుడు. మొగలాయిలతో పోరాడి మరాఠా సామ్రాజ్యానికి తిరుగులేదని చాటిన వీరుడు. యుద్ధతంత్రాల్లో ఆరితేరిన శివాజీ తన రాజ్యాన్ని రక్షించుకోవడానికి గూఢచారి వ్యవస్థను ఏర్పాటు చేసుకోవడంతో పాటు, శతృదుర్భేద్యమైన కోటల నిర్మాణం కూడా చెపట్టాడు. శివాజీ మరణించేనాటికి దాదాపు 300 కోటలు ఆయన ఆధీనంలో ఉన్నాయంటే అర్థం చేసుకోవచ్చు . రాజ్య రక్షణకు కీలకయిన కోటల పట్ల ఆయన ఎంత శ్రద్ధ వహించాడు. మరారి సామ్రాజ్యానికి ముఖ్యమైన కోటలలో ఒకటి రాయ్ ఘడ్ కోట.***



రాయ్ ఘడ్ కోట ముంబై మహానగరానికి 160 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. మొదట్లో రైరి కోటగా పిలువబడిన దీన్ని జవాలి రాజు చంద్రరాజీ మోర్ నిర్మించినట్లు చెబుతారు. చత్రపతి శివాజీ 1656 లో ఈ కోటను స్వాధీనం చేసుకుని పటిష్టపరిచి. పునరుద్ధరించి రాయ్‌గడ్ (కింగ్స్ ఫోర్ట్) అని పేరు పెట్టారు. ఇక అప్పటి నుండి ఇది శివాజీ మరాఠా రాజ్యానికి రాజధానిగా మారింది. సముద్ర మట్టానికి 2700 అడుగుల ఎత్తులో ఉండే ఈ కోట చుట్టూ సహ్యాద్రి పర్వతాలు కనువిందు చేస్తాయి. ఆ కోట అందాలను తిలకించాలంటే దాదాపు 1737 మెట్లు ఎక్కి పైకి వెళ్ళాల్సి ఉంటుంది.

మేము రాయ్ ఘడ్ కోటను చూసేందుకు వెళ్లిన ఉద్దేశ్యం మరాఠా సామ్రాజ్యానికి తలమానికంగా ఉన్న ఆ కోట వైభవాన్ని చూడాలని. ముందుగా మేము హైదరాబాద్ నుండి ముంబై వెళ్ళి అక్కడి నుండి మూడు గంటల పాటు ప్రయాణం చేసి పఛాడ్ అనే గ్రామానికి చేరుకున్నాం. ఒకప్పుడు ఈ పఛాడ్, రాయ్ ఘడ్ అనే రెండు గ్రామాలు చాలా ప్రసిద్ధి చెందినవి. ఈ గ్రామాల్లో అందరూ సైనికులే నివశించేవారట. కోట రక్షణ కోసం ఇలా ఏర్పాటు చేసినట్లు తెలిసింది. కోట పైకి వెళ్ళాలంటే ఎవరైనా ఇక్కడి నుంచే వెళ్ళాలి. ఈ కోటలోకి ప్రవేశించాలంటే రెండు మార్గాలు ఉంటాయి. ఒకటి కాలినడకన ఆ మెట్లను ఎక్కుతూ వెళ్ళడం. రెండోది రోప్‌వే ద్వారా అక్కడికి చేరుకోవడం. మేము మాత్రం రోప్ వే ద్వారానే వెళ్ళాలని నిర్ణయించుకొని బయలుదేరాం. ఒక పాకేజ్‌లో భాగంగా రోప్‌వే రైడ్, మ్యూజియం చూడవచ్చు. రోప్‌వే ద్వారా వెళితే అది మీనా దర్వాజ అనే స్థలంలో



శివాజి మహారాజ్ సమాధి



దింపేస్తుంది. ఈ మీనా దర్వాజ అనేది ఒకప్పుడు రాజాస్థానంలోని మహిళలకు మాత్రమే ప్రవేశం ఉండే ద్వారం. అక్కడ దిగి ఇక మిగతా ప్రాంతాలను చూడటానికి వెళ్ళవచ్చు.

అయితే రోప్ వే గుండా కోట పైకి వెళుతుంటే కనిపించే దృశ్యాల గురించి ఎంత చెప్పుకున్నా తక్కువే. చుట్టూ ఉన్న సహ్యాద్రి పర్వత శ్రేణుల అద్భుత ప్రకృతి దృశ్యాలు, వంపుసొంపుల జలపాతాలు, ఆకుపచ్చని అడవులు రా రమ్మని పిలుస్తూ వాటి అందాలతో మమ్మల్ని మంత్ర ముగ్ధుల్ని చేశాయి. అక్కడి నేల, నీరు, కొండ, కోన సమన్వయంతో ప్రకృతిని అంత అద్భుతంగా తీర్చిదిద్దాయా అనిపిస్తుంది వాటిని చూస్తుంటే.

రోప్‌వే దిగాక కాస్త ముందుకు నడుస్తూ వెళ్ళాం. ఒక్క అడుగు ముందుకు వేశామో లేదో మరాఠా సామ్రాజ్య వైభవం ఒక్కసారిగా కళ్లముందు కదలాడినట్లు అనిపించింది. శత్రుదుర్భేద్యమైన రాతి కోట, దాని చుట్టూ ఎత్తైన గోడ, అబ్బురపరిచే శిల్పకళా సంపద చూస్తూ విస్తుపోవడం మా వంతైంది. ఆ కోట నిర్మాణంలో తీరుతెన్నులలో మరాఠాల చాతుర్యం అడుగడుగున చూడవచ్చు. కోట ప్రధాన ద్వారాన్ని ఇతరులెవరూ చొరబడేందుకు వీలు లేకుండా పటిష్టంగా నిర్మించారు. కోట చుట్టూ మూడు వైపుల గోడను నిర్మించి కేవలం ద్వారం గుండా మాత్రమే అందులోకి ప్రవేశించేలా నిర్మించాడు.

కోటలో ప్రత్యేకంగా ప్రస్తావించుకోవాల్సినవి అందులో ఒకటి ప్రధాన దర్వాజ, తర్వాత విల్లు ఆకారంలో ఉన్న మరో ఇరవై దర్వాజలు. ఒక్కొక్కటి 65-70 అడుగులు వరకు ఉంటాయి. ఇవన్నీ కూడా కోటలో చాలా ప్రత్యేకమైన సందర్శన ప్రదేశాలు అని చెప్పవచ్చు. ఇక్కడికి పర్యాటకులు


గంగ సాగర్

అధిక సంఖ్యలో వస్తుంటారు. మేము అక్కడ ఒక్కోటి చూస్తూ వాటి పనితనాన్ని తెలుసుకుంటూ ఆ ప్రాంతం అంతా కలియతిరిగాం.

ఆ కోటలోనే ఒక దగ్గర ఛత్రపతి శివాజీ సింహాసం కూడా కొలువుదీరి ఉంది. శివాజీ



మహారాజుకు సంబంధించిన విగ్రహం కూడా ఆ ప్రాంతంలో ఉంది. శివాజీ విగ్రహం పక్కనే ఆయన పెంపుడు కుక్కకు సంబంధించిన విగ్రహం కూడా ఉంది. దీన్ని 2012 ప్రాంతంలో ఎవరో గుర్తుతెలియని వ్యక్తులు ధ్వసం చేస్తే పెద్ద ఎత్తున అల్లరు జరిగాయని తెలిసింది.

రాయ్ ఘడ్ కోటలో ప్రత్యేక ఆకర్షణ రాణి మహల్. ఆరు గదులు వీటిలో ప్రత్యేకంగా కూడా నిర్మించారు. ఇక్కడి మూడు వాచ్ టవర్లు నుండి ప్రకృతి అందాలను తిలకించవచ్చు.

***ఇంత అద్భుతమైన కోటపై ఈస్టిండియా కంపెనీ వాళ్లు దాడిచేసి దాన్ని హస్తగతం చేసుకున్నారు. చాలా మట్టుకు కోట భాగాలు ధ్వంసం అయినప్పటికీ ఇంకా ఆ దుర్భేధ్యమైన కోట మరాఠా రాజుల పౌరుషాన్ని ప్రపంచానికి చాటుతూ తన ప్రత్యేకతను నిలుపుకున్నది.***

ట్రెక్కింగ్ ప్రియులకు ఈ రాయ్ ఘడ్ కోటకు




శివాజి కుక్క సమాధి

మించినది లేదనే చెప్పవచ్చు. ఈ ప్రాంతంలో తిరుగాడితే కోటగోడలు నాటి వీరోచిత కథలను విప్పిచెప్పినట్లుగా అనిపిస్తుంది. మనకు తెలియకుండానే మరాఠా వీరుల పౌరుష్యాన్ని గుండె నిండా నింపుకొని తిరిగి వస్తాము.

రాయ్ గఢ్ కోట అంటే మహారాష్ట్రలోని రాయ్ గఢ్ జిల్లా అని భావించకండి. రాయ్ గఢ్ కోటను మొగలాయిలతో అనేక యుద్ధాలు చేసిన శివాజీ నిర్మింప చేశాడు. కోటను మూడువేపులా ప్రవేశం లేని కొండలతోను నాలుగవ వైపు పూర్తి భద్రతా కావలితోను ఉండేలా నిర్మాణం చేశారు. కోట ప్రవేశించాలంటే ఒకే కాలిమార్గం. శత్రువులు లోపలికి చొరబడలేరు.

ఖైదీలను శిక్షించే గదులు కూడా కలవు. ఈ కోటకు ప్రారంభంలో 1500 మెట్లు కలవు. అయితే నేడు పర్యాటకులు 2700 అడుగుల ఎత్తుకల ఈ కోటను చేరేందుకు రోప్ వే ఉపయోగిస్తున్నారు. శివాజి విగ్రహం ఒకటి ఉంటుంది. ఒక దేవాలయం, మరియు శివాజి సింహాసనపు గది కూడా కలవు.

ఈ కోట నీటి అవసరాలు గంగా సాగర్ సరస్సు తీరుస్తుంది. పర్యాటకులు ఈ సుందర ప్రదేశ ఛాయా చిత్రాలు తీసి ఆనందించవచ్చు. మహారాష్ట్రలో మరాఠా పాలనా కాలం నాటి అనేక కోటలు, ప్రదేశాలు కలవు. కాని రాయ్ గఢ్ ఉన్నంత సుందరంగా నేటికి ఏ ఇతర కట్టడమూ లేదు.



# 15వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

ప్రముఖ జర్నలిస్ట్
మరియు రచయిత
'పర్యాటక రత్న'
శ్రీ మైనాస్వామి
సంపాదకత్వంలో పర్యాటక రంగ
విశేషాలపై వెలువడుతున్న
టూరిజం న్యూస్
15వ వార్షికోత్సవం
జరుపుకొంటున్న సందర్భం
హార్థిక శుభాకాంక్షలు.



**నాగే నాయక్ & శ్రీమతి రాధా బాయి**
సర్పంచ్, మేజర్ గ్రామ పంచాయతీ,
**గోరంట్ల**, అనంతపురం జిల్లా

# అనంతశయన గుడి

■ మైనాస్వామి



*విజయనగర సామ్రాజ్య చక్రవర్తి శ్రీక్రిష్ణదేవరాయలు (క్రీ.శ. 1509-29) తన పాలనా కాలంలో వందలాది దేవాలయాలను కట్టించాడు. వేలాది గుళ్ళను విస్తరింపచేశాడు. ఉదయగిరి దుర్గంపై సాధించిన విజయానికి గుర్తుగా హంపిలో క్రిష్ణాలయాన్ని నిర్మించాడు. తూర్పు దేశ దిగ్విజయ దండయాత్రకు నిదర్శనగా హంపి విఠలాలయాన్ని భారీగా విస్తరించాడు. తల్లి నాగలాదేవి ఆనతి మేరకు చిత్తూరు జిల్లా నాగలాపురంలో వేదనారాయణస్వామి గుడిని అద్భుతంగా పునర్ నిర్మించాడు. కొడుకు - తిరుమలదేవ మహారాయలను ఆరేండ్ల వయసులో రాజుగా ప్రకటించిన సందర్భంగా.. పుత్రుని గౌరవార్థం 'అనంతశయనగుడి'ని హొసపేటలో కట్టించాడు. శ్రీ మహావిష్ణువు శయన భంగిమలో వున్న నల్లరాతి విగ్రహాన్ని అత్యద్భుతంగా మలిపించినా.. గుడిలో ప్రతిష్ఠించలేక పోయాడు. అనంతస్వామి భారీ విగ్రహాన్ని కొలువు దీర్చడం కోసం గర్భగుడిని భారీగా తీర్చిదిద్దాడు. బహుశ: దేశంలోని ఏ దేవాలయంలోనూ అంతపెద్ద గర్భగుడి వుండదంటే అతిశయోక్తి కాదేమో! గర్భగుడికి మూడు తలుపులున్నాయి. గర్భగుడిపై గల విమాన శిఖరం.. మామూలు విమాన శిఖరాలకు భిన్నంగా వుంది. పొడవుగా ఆదిశేషుని పానుపు మాదిరిగా వుంది. మహామండపంలోని శిల్పం ఎంతో బాగుంది. అనంతశయన గుడి పక్కనే అమ్మవారి కోవెల కలదు. ఉత్సవ మండపం ప్రత్యేకంగా వుంది. అనంత శయన గుడికి ఒక ఆలయానికి వుండవలసిన అన్ని హంగులూ వున్నాయి. శ్రీ క్రిష్ణదేవరాయల జీవితంలో అత్యంత ముఖ్యమైనది...ఆ గుడి. కానీ సందర్శకులు మాత్రం చాలా తక్కువగా వెళ్ళుతుంటారు. విజయనగర సామ్రాజ్య రాజధాని - హంపి నగరాన్ని నిత్యం వేలాది మంది పర్యాటకులు సందర్శిస్తుంటారు. అయితే అనంతుని ఆలయం గురించి వారికి అంతగా తెలియదు. ఆ గుడిని చూడకపోతే హంపి పర్యటన సంపూర్ణం కాదు. హంపికి వెళ్ళినపుడు హొసపేటకు 1.6కి.మీ. దూరంలోని అనంతశయన గుడిని తప్పక చూడాలి. అనంతశయనగుడిపై టూరిజం న్యూస్ ప్రత్యేక కథనం ఈ విధంగా వుంది.*



కర్నాటకలోని హంపిలో దాదాపు 350 గుళ్ళున్నట్టు అంచనా. అందులో విరూపాక్ష స్వామి ఆలయం, విఠలాలయం, క్రిష్ణుని కోవెల, హజార రామ దేవాలయం, అనంతశయనగుడి అత్యంత ముఖ్యమైనవి. ఆ ఆలయాలు క్రిష్ణదేవరాయలకు చాలా ఇష్టమైనవి. హజారరామగుడి కేవలం రాజ కుటుంబం కోసం మాత్రమే నిర్మించినది. శ్రీ మహావిష్ణువుకు మహా భక్తుడైన శ్రీక్రిష్ణదేవరాయలు అనంతపద్మనాభ స్వామి కోసం హంపిలో ప్రత్యేకంగా ఒక గుడిని కట్టించాలని సంకల్పించాడు. అంతకు మునుపే తన తల్లి నాగలాంబ పేరు మీద కొత్త పట్టణం – నాగలాపురంను నిర్మించాడు. హంపి పక్కనే మరో పట్టణం వెలసింది. నాగలాపురంను హొసపేట అని కన్నడలో పిలిచేవారు. చివరకు హొసపేటగా స్థిరపడింది. క్రిష్ణరాయలు తన భార్య పేరు మీద నాగలాపురం అనే కొత్త పట్టణాన్ని నిర్మించాడని పోర్చుగీసు గుర్రాల వ్యాపారి ఫెర్నావ్ న్యూనిజ్ తప్పుగా రాశాడు. న్యూనిజ్ క్రీ.శ. 1535–1537 సంవత్సరాల మధ్య విజయనగరం (హంపి)లో పర్యటించాడు. కొత్త పట్టణంలో ఒక పెద్ద గుడి వుండాలని భావించిన రాయలు అనంతపద్మనాభ స్వామి కోసం అనంతశయన గుడిని క్రీ.శ. 1524లో కట్టించాడు. తన కుమారుడు తిరుమలదేవమహారాయలు పట్టాభిషిక్తుడయిన సందర్భంగా అనంతశయన గుడి రూపు దిద్దుకొన్నది.

***నేపథ్యం :*** శ్రీక్రిష్ణదేవరాయలకు తిరుమల దేవి – చిన్నమాదేవి భార్యలు. తిరుమల దేవికి తిరుమలాంబ, చిన్నమాదేవికి వెంగళాంబ పుత్రికలు కలిగారు. ఒరిస్సా గజపతుల ఆధీనంలోని ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి నుంచి కటకం దాకా పలు దుర్గాలను క్రీ.శ. 1515 –16లో జయించాడు. ఒరిస్సారాజు ప్రతాపరుద్ర గజపతి కుమార్తె అన్న పూర్ణదేవి (తుఖ్ఖాదేవి మరోపేరు) ని రాయలు మూడో భార్యగా స్వీకరించాడు. తమకు కొడుకులు కలగాలని ఎందరో దేవుళ్ళను వేడుకొన్నారు తిరుమల దేవి – చిన్నమాదేవి. క్రిష్ణరాయల పట్టపురాణి – తిరుమల దేవి ఆజ్ఞప్రకారం మంత్రి రాయసంకొండమరుసయ్య పెనుకొండ రాజ్యంలోని చోళ సముద్రం గ్రామంలో వెలసిన చౌడేశ్వరిమాత గుడిలో ప్రత్యేక పూజలు చేయించాడు. చౌడమ్మ తల్లికి రాయలవారి తరపున కానుకలు సమర్పించాడు. అందుకు సంబంధించిన శాసనం చౌడమ్మ దేవాలయం ముందు వుంది. శాసనం క్రీ.శ. 1517 డిసెంబర్ 1 నాటిది. శాసన భాష కన్నడం. తిరుమలదేవిని తిరుమలాంబికగా పేర్కొన్నారు. శాలివాహన శకవర్షం 1439 ఈశ్వర నామ సంవత్సరం మార్గశిర బహుళ తదియనాడు "క్రిష్ణరాయ మహా రాయరిగె సంతానాభివృద్ధి యాగ బేకెందు" అని చౌడమ్మను ప్రార్థించాడు కొండమరసయ్య. మహామంత్రి తిమ్మరుసు కొడుకే కొండమరసు. చోళ సముద్రం చౌడమ్మ తల్లిని ఆరాధించిన ఏడు నెలల తర్వాత తిరుమల దేవికి




కొడుకు పుట్టాడు. క్రిష్ణరాయల సంతానం గురించి మైసూరు దేశంలో శాసనం వెలసింది. మైసూరు దగ్గర గల గుండ్లుపేటకు 12కి.మీ. దూరంలోని బీమనబీడులో రాజప్రతినిధి గోవిందరసు క్రిష్ణరాయలకు పుత్రుడు కలిగాడని కన్నడంలో శాసనం రాయించాడు. శాలివాహన శకవర్షం 1440 బహుధాన్య సంవత్సరం శ్రావణ శుద్ధ ద్వాదశి... అంటే క్రీ.శ. 1518 జూలై 19న క్రిష్ణదేవరాయలకు వారసుడు పుట్టాడు. తిరుమల దేవి తన పుట్టనింట – శ్రీరంగపట్నంలో ప్రసవించి వుండవచ్చు. అందువల్లనే రాజప్రతినిధి గోవిందరసు శ్రీనివాస పండిత, తిరుమల పండిత అనే బ్రాహ్మణులకు సర్వమాన్యంగా కొంత భూమిని దానం చేశాడు. రాయలకొడుకు – 'తిరుమలరాయ మహారాయ' అంటూ పేరును ప్రస్తావిస్తూ రెండో దానశాసనం హంపి – కమలాపురంలోని కుమ్మరకుంటె వద్ద వుంది. తనకు కొడుకు కలిగిన సందర్భంగా రాయలు కుమ్మరకుంటె భూమిని అంజనగిరి (తిరుమల) తిరువెంగళనాథగుడికి దానం చేశాడు. హంపి విఠలాలయంలో విఠలుని సన్నిధిలో దానం చేసినట్టు కుమ్మరకుంటె శాసనం చెబుతున్నది. 'పట్టమహాదేవి – తిరుమల దేవి అమ్మ నవరు, తిరుమల రాయ మహారాయరిగె పుణ్యవాగ బేకు' అని శాసనం 9వ పంక్తిలో పేర్కొనడం జరిగింది. శాలివాహన శకవర్షం 1440 బహుధాన్య సం. కార్తీకమాసం బహుళద్వాదశి శనివారంనాడు శాసనం రాయబడింది. (ఇంగ్లీష్ తేదీ : 1518 అక్టోబర్ 30). క్రిష్ణదేవరాయలు తన దేవేరులతో 3 నెలల పసికందును వెంటబెట్టుకొని తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించి, విజయనగరానికి తిరిగి వచ్చిన తర్వాత కుమ్మర కుంటె భూదానం చేశాడు. కాగా తిరుమలదేవరాయలు ఆరేండ్ల వయసు నాటికే రాజయ్యాడు. కొడుకు రాజైన తర్వాత క్రిష్ణరాయలు మంత్రి అయ్యాడు. అంతవరకు మంత్రిగా వున్న సాళువతిమ్మరుసు దుర్గాధిపతి అయ్యాడు. క్రీ.శ. 1524 మార్చి లేదా ఏప్రిల్‌లో తిరుమలదేవరాయలు యువరాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు. తిరుమలదేవరాయలను రాజుగా పేర్కొంటున్న శాసనాలు మూడు అనంతపురం జిల్లా గోరంట్లలో వున్నాయి. రెండు శాసనాలు సోమేశ్వరాలయం ఉత్తర ద్వారం గోడ బండలపై అటూ ఇటూ వున్నాయి. రెండు శాసనాలూ ఒకే రోజు రాయడం జరిగింది. గోరంట్ల సోమేశ్వర గుడి విమాన శిఖరానికి మరమ్మత్తులు చేయడం, గుడికి మట్టి ప్రాకారాన్ని నిర్మించడం, విస్తరాకుల వెట్టిని రద్దు చేయడం, ధర్మానికి వక్రంగా నడిచే వారు. దేవతాద్రోహులు వంటి విషయాలు కుడివైపు గోడబండపై వున్నాయి. "శ్రీమన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప తిరుమలదేవమహారాయలు పృథ్వీ రాజ్యం చేయుచుండగా" అని తెలుగులో వుంది. వాకిటి ఆదెప్ప నాయకుని కార్యకర్త సూరపరాజు ఆ శాసనాన్ని రాయించాడు. శాలివాహన శక వర్షం 1446 తారణ సం. అధిక భాద్రపద శుద్ధ 15 ఆదివారం (క్రీ.శ. 1524 ఆగస్టు 14) నాడు గోరంట్ల శివాలయ శాసనం వెలసింది. అదే ద్వారంలో ఎదురుగా వున్న మరో శాసనంలోనూ దాదాపు అదే విషయం వుంది. గోరంట్ల మాధవరాయల గుడి మహా మండపంలో ముఖ ద్వారానికి ఎడమవైపు గోడపై గల శాసనం తిరుమల దేవరాయలను రాజాధిరాజుగా పేర్కొంటున్నది. వాకిటి ఆదెప్ప నాయకుడు తమ తండ్రి రామరసుకు పుణ్యం అబ్బాలని గోరంట్ల రావికుంట వెనుక గల భూమిని మాధవరాయస్వామి దశమి సేవకు, నైవేద్యానికి దానం చేసిన విషయం శాసనంలో వుంది. శకవర్షం 1446 తారణ సం. కార్తీక శుద్ధ 12 సోమవారం (క్రీ.శ. 1524 నవంబర్ 7) నాడు శాసనాన్ని రాయడం జరిగింది. గోరంట్ల మాధవరాయల గుడి మహామండపాన్ని శ్రీ క్రిష్ణదేవరాయలు 1524లో కట్టించాడు. మహామండపంలో తెలుగు, కన్నడ,



గర్భగుడి లోపలి చిత్రం




సంస్కృతంలో శాసనాలున్నాయి. గోరంట్ల శాసనాలు మినహా మరే శాసనమూ తిరుమల దేవ మహారాయలను రాజుగా పేర్కొనలేదు.

తిరుమల దేవరాయలు రాజుగా పట్టాభిషిక్తుడయిన తర్వాత సం. రోజులు రాజ్యమంతటా ఉత్సవాలు నిర్వహించాలని క్రిష్ణరాయలు ప్రకటించాడు. ఆ సందర్భంగా పలు దాన ధర్మాలు చేశాడు. తిరుమల రాయల పట్టాభిషేకానికి గుర్తుగా వెలసిందే హొసపేట – అనంతశయన గుడి. గుడి వున్న ప్రాంతాన్ని తిరుమల రాయమహాపురంగా పేరు పెట్టారు.

***గుడి తీరు :*** అనంత పద్మనాభస్వామి కోసం అనంతశయన గుడిని విశాలమైన ఆవరణంలో నిర్మించారు. ఆవరణంలోకి ప్రవేశించడానికి ముందు అసంపూర్ణంగా వున్న ముఖద్వార గోపుర వేదిక కనిపిస్తుంది. వేదిక పునాది చాలా బలంగా వున్నా... కొంత విధ్వంసానికి గురయింది. భారీ ద్వార బంధాలు విజయనగర శిల్ప శైలికి ప్రతీకలుగా వున్నాయి. త్రిభంగిమలోని శిల్పాలు రమణీయంగా వున్నాయి. గర్భగుడి, అర్ధమండపం, మహామండపం, పక్కన అమ్మవారి ఆలయం, మరోపక్క ఉత్సవ మండపం, సమీపంలోనే ఒక బావి వుంది. పద్మనాభస్వామి దేవాలయం సంపూర్ణంగా సర్వహంగులతో వుంది. మహా మండపంలోకి ప్రవేశించేటప్పుడు ఎడమవైపు స్తంభంలో శ్రీక్రిష్ణదేవరాయల శిల్పం కనిపిస్తుంది. రాయలవారు స్వయంగా భక్తులకు ఆహ్వానం పలుకుతున్నట్టుంది. వెనుక వున్న స్తంభంలో తిరుమల దేవరాయల బొమ్మ వుంది. ఎనిమిది వరుసలతో వున్న మహామండప స్తంభాల్లో అత్యున్నత శిల్ప సంపద వుంది. వైష్ణవ గాథలకు సంబంధించిన ఎన్నో శిల్పాలున్నాయి. వైష్ణవ మతాచార్యుడు రామానుజుల వారి బొమ్మలున్నాయి. హంస వంటి రాజపక్షులున్నాయి. మహా మండపంలోని అనంత శిల్ప సంపదను చూసి మురిసిపోతూ ముందుకు వెళ్ళితే అర్ధ మండపం కనిపిస్తుంది. అక్కడే ప్రదక్షిణాపథం వుంది.

అనంత పద్మనాభస్వామి గర్భగుడి చాలా విశాలమైనది. గర్భగుడి అంత విశాలంగా ఎక్కడా వుండదు. గర్భగుడి ఎత్తు దాదాపు 80 అడుగుల దాకా వుంటుంది. దీర్ఘ చతురస్రాకారంలో గల గర్భగుడిపై నిర్మించిన విమాన శిఖరం నాటి శిల్పుల



గర్భగుడి వెనుక దృశ్యం

ప్రతిభను చాటి చెబుతున్నది. విమాన శిఖరం సుమారు 35 అడుగుల ఎత్తు వుంటుంది. ఇటుకలు – గారతో కట్టిన విమాన శిఖరంలో దేవతా ప్రతిమల కోసం పంజరాలున్నాయి. సాధారణంగా విమాన శిఖరాలు నాగర, వేసర, ద్రావిడ పద్ధతుల్లో వుంటాయి. దక్షిణాదిలో శిఖరాలు ద్రావిడ పద్ధతిలో ఎంతో అందంగా రూపొందాయి. విమాన శిఖరం స్వర్గానికి లేదా దేవలోకానికి ప్రతిరూపం. విమానం సర్వదేవతలకు నిలయం. అనంతశయన గుడి విమాన శిఖరం భిన్నంగా వుంది. విమానంలో గ్రీవం, శిఖరం, పంజరాలున్నాయి. స్థూపి, కలశం లేవు. పక్కనున్న అమ్మవారి శిఖరం ద్వితల విమానం. ద్రావిడ పద్ధతికి దర్పణం పడుతున్నది. నాలుగు చేతులతో కూర్చొన్న విధంగా వున్న లక్ష్మీదేవి విగ్రహం అమ్మవారి గుడిలో వుండేదని భారత పురావస్తు సర్వేక్షణ వార్షిక నివేదిక – 1922లో పేర్కొనడం జరిగింది. అనంతశయన గుడి విధ్వంసానికి గురయినట్టు, గర్భగుడిని అగ్గితో కాల్చినట్టు కొన్ని నివేదికలు స్పష్టంచేస్తున్నాయి. గుడి చుట్టూ గల రక్షణగోడ కూల్చివేతకు గురయింది. మహామండపం ముందు నాలుగు స్తంభాల మండపం వుంది. అందులో ఆంజనేయ స్వామి విగ్రహం వుంది. మారుతిక్షేత్రపాలకుడు ఆ మండపానికంటే ముందున్న దీపస్తంభం ఎంతో కళాత్మకంగా వుంది.



సాలభంజికల శిల్పాలు

***విగ్రహం ఎక్కడ :*** అనంతశయనగుడిలో అనంతపద్మనాభస్వామి విగ్రహం లేదు. గర్భగుడి ఖాళీగా బోసిపోయి కనిపిస్తుంది. క్రీ.శ. 1524లో ఆలయం నిర్మాణం పూర్తయిన తర్వాత 1549 వరకు పూజలు జరిగినట్టు పురావస్తు శాఖ ఒక నివేదికలో పేర్కొన్నది. అయితే అనంత పద్మనాభస్వామి విగ్రహం – మూల విరాట్‌కు సంబంధించన గాథ ఎంతో ఆసక్తిని రేకెత్తిస్తుంది. శ్రీ మహావిష్ణువు శేషతల్పంపై శయన భంగిమలో వున్న విధంగా నల్లరాతిలో ఒక అద్భుత శిల్పాన్ని రూపొందించాలని గుడి నిర్మాణ దాత క్రిష్ణరాయలు శిల్పాచార్యులను ఆదేశించారు. రాజు ఆదేశం ప్రకారం శిల్పులు నల్లశాణం రాతిలో అనంతశయన స్వామి సుందరరూపాన్ని ఆవిష్కరించారు. విగ్రహం తరలింపు కొన్ని యోజనాల దూరంలో ప్రారంభమయింది. ఎలాంటి ఆటంకాలు లేకుండా తమ వెంట హంపికి రావాలని శిల్పులు స్వామిని వేడుకొన్నారట. స్వామి ఒక షరతు పెట్టాడట.



హొలలు గుడిలోని అనంతశయన స్వామివిగ్రహం

విగ్రహం తరలించే సమయంలో వెనుకకు చూడకూడదు. కొన్ని యోజనాలు ప్రయాణించిన తర్వాత స్వామివారు సరిగా వస్తున్నారా అంటూ ఒక వ్యక్తి వెనుకకు తిరిగి చూశాడట. తర్వాత పద్మనాభస్వామి విగ్రహం ముందుకు కదలలేదు. ఆ సంఘటన జరిగింది బళ్ళారి జిల్లా హడగలి తాలూకా హొలలు గ్రామం వద్ద. అనంతశయనస్వామి సుందరమూర్తి 'హొలలు' లోనే వుండి పోయింది. ఆ గాథను బ్రిటిష్ అధికారి ఫ్రాన్సిస్ రూపొందించిన 1904 నాటి బళ్ళారి గెజిటీర్ తెలుపుతున్నది. భారత పురావస్తు సర్వేక్షణ వారు ప్రచురించిన హంపి పుస్తకంలో కూడా ఆ వాడుక గాథను పేర్కొన్నారు. నిజానికి ఆ విగ్రహం హొలలు రంగనాథస్వామి ఆలయంలో పూజలందుకొంటున్నది. మరి అనంతశయన గుడిలో పూజింపబడ్డ విగ్రహం ఎక్కడుంది. ఎందుకంటే క్రీ.శ. 1549 వరకు గుడిలో పూజలు జరిగినట్టు ఆధారాలు న్నాయి. కమలాపురం మ్యూజియం ఆవరణలో తెల్లరాతితో మలిచిన అనంతపద్మనాభస్వామి విగ్రహం వుంది. అదే విగ్రహమే పూజలందుకొన్నదేమో.

***శాసనం :*** అనంతశయనగుడి మహామండపంలో ఎడమవైపు గోడపై పెద్ద శాసనముంది. అందులోని



ఉత్సవ మండపం

భాష సంస్కృతం శ్రీక్రిష్ణదేవరాయలు తన కొడుకు తిరుమల దేవమహారాయలు గౌరవార్థం 1524లో గుడిని నిర్మించినట్లు శాసనంలో వుంది. అనంతశయన గుడి ప్రాంతాన్ని 'తిరుమల మహారాయపురం'గా నామకరణం చేశారు. బళ్ళారి జిల్లా సండూరు సమీపంలోని పొలాలను గుడికి మాన్యంగా ఇచ్చారు.

వైఖానస ఆగమ పద్ధతిలో నిత్య పూజలు జరగాలని క్రిష్ణరాయలు ఆదేశించాడు.

కాగా తిరుమల దేవమహారాయలు పట్టాభిషిక్తుడయిన సందర్భంగా జరుగుతున్న ఉత్సవాలు ముగియక ముందే యువరాజు మరణించాడు. ప్రత్యేక ఉత్సవాలు 8 నెలల పాటు జరిగినట్లు చరిత్రకారులు రాశారు. క్రీ.శ. 1524 ఏప్రిల్ (బహుశ: ఉగాది నాడు)లో పట్టాభిషేకం జరుగగా, అదే సంవత్సరం డిసెంబర్‌లో తిరుమల దేవరాయలు మరణించి వుండవచ్చు. తిరుమల రాయల పేరుతో వెలువడిన ఆఖరు శాసనం తమిళనాడులోని చెంగల్పట్టులో 1524 డిసెంబర్ 11 నాటిది. తర్వాత తిరుమల పేరు మీద శాసనాలు లేవు. అనంతశయన గుడిని సందర్శిస్తే శ్రీక్రిష్ణదేవరాయల వైష్ణవభక్తితత్వంతో పాటు, కుమారుడు తిరుమలరాయలపై గల అవ్యాజమైన ప్రేమ తెలుస్తుంది.

*(రచయిత చారిత్రక పరిశోధకుడు)*



మహామండపంలోని శాసనం

# History of Sanchi Stupa



***Fascinating and world famous Stupa and other structures at Sanchi portraying brilliance of Buddhist Art and Sculpture attract the attention of thousands of Tourists and enthusiastic Historians. The Hill of Sanchi is at adistance of 9 Kms from Vidisa in Madhaya Pradesh.Vidisa is 60 Kms from Bhopal. Sanchi was Buddhist centre of attraction for a period of about fifteen hundred years, from 3rd century B.C. to 12th century A.D. The Maha Stupa at Sanchi is one of the oldest stone structures in India, and an important monument of Indian Architecture. It was originally commissioned by the Mauryan emperor Ashoka in the 3rd century BC. Its nucleus was a simple hemispherical brick structure built over the relics of the Buddha. According to chronicles of Sri Lanka, Mahendra, son of Asoka and queen Devi, had played key role in the development of Sanchi Stupa. Asoka had married Devi, daughter of a merchant of Vidisa. Mahendra had stayed at Sanchi before his visit to Sri Lanka.***

The foundation of the Buddhist establishment at Sanchi, was laid by Mauryan emperor Asoka (269-231 B.C.). He built Maha Stupa and erected a huge monolithic pillar.Pillar was broken.There is inscription on the pillar with Bramhi script. Asoka married Devi,daughter of a trader in Vidisa. The religious fervour found its expression in vigorous building activity in the middle of the second century B.C. Stone encasing and enlargement of Maha Stupa, erection of balustrades round its ground, berm, stairway and harmika, the reconstruction of aTemple and building of small Stupas etc activities took place during Sunga period.The Satavahana Kings also made donations to Sanchi viharas and beautified with gates.

There was revival of sculptural activity at Sanchi during the reign of Guptas. Guptas conquered the kingdom of Kshatrapas around 400 A.D. They had established peace and prosperity. The Gupta period, which ushered in a new epoch in the history of Indian Temple-Architecture, saw at Sanchi. Gupatas constructed a Temple in the premises of Sanchi Stupa. Temple has withstood the ravages of time, found one of the earliest Gupta temples. Harshavardhana (606-647 A.D.) achieved political unity in north India. His espousal of the cause of Buddhism brought a fresh lease of life to the religion. The vestiges of the seventh and eighth centuries, which saw the building of several monasteries and temples. Number of Buddha images of made during the period of Harshavardhana. After the death of Harsha, northern India once, more became a prey to the ambitions of different dynasties. The Pratiharas, who had established themselves in the Malwa region by the eighth century, were followed by the Paramaras in the next century. But Sanchi seems to have been hardly affected by these political changes, as the existence of number of medieval monasteries and temples testifies to a period of continued prosperity.





Gupta Temple - Sanchi









కుటుంబంలో సంపాదించే వ్యక్తిని కోల్పోయి నిస్సహాయ స్థితిలో ఉన్న
నిరుపేద కుటుంబాలకు ఆలంబనగా జగనన్న ప్రభుత్వం కల్పిస్తున్న రక్షణ..



# వైఎస్సార్ బీమా

పేద కుటుంబాలకు ఇస్తుంది ధీమా..



**పథకం కింద అర్హులై ఉండి బ్యాంకుల్లో ఎన్‌రోల్ కాకుండా మిగిలి, దురదృష్టవశాత్తు మరణించిన 12,039 మంది కుటుంబాలకు మానవతాదృక్పథంతో బీమా క్లెయిమ్‌కు సమానమైన రూ.254 కోట్లను నేడే చెల్లించనున్న మన జగనన్న ప్రభుత్వం..**

శ్రీ వై.ఎస్. జగన్ మోహన్ రెడ్డి
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి

**ఏటా రూ.510 కోట్ల ఖర్చుతో అర్హత ఉన్న**
**1.41 కోట్ల నిరుపేద కుటుంబాలకు "వైఎస్సార్ బీమా" ద్వారా ఉచిత బీమా రక్షణ..**

గతంలో ఉన్నట్లుగా ప్రతి పాలసీకి PMJJBY, PMSBY కింద కేంద్ర ప్రభుత్వం ఇచ్చే 50 శాతం వాటా ఇప్పుడు లేనప్పటికీ, మానవతాదృక్పథంతో **దేశంలో ఎక్కడా లేనివిధంగా పూర్తి ఖర్చు రాష్ట్ర ప్రభుత్వమే భరిస్తూ ఉచిత బీమా అమలు చేస్తున్న జగనన్న ప్రభుత్వం...**

ప్రత్యేకంగా రాష్ట్ర ప్రభుత్వ నిధుల నుంచి ఆర్థిక సహాయం చేయాలని జగనన్న ప్రభుత్వం తీసుకున్న నిర్ణయంతో దురదృష్టవశాత్తు కుటుంబ పెద్దను కోల్పోయిన మొత్తం12,039 కుటుంబాలకు భరోసా..

రాష్ట్ర ప్రభుత్వమే పూర్తి ప్రీమియం చెల్లిస్తూ, 2020 అక్టోబరు 21 న వైఎస్సార్ బీమా పథకం ప్రారంభించింది.. గతంలో ఎన్నడూ లేని విధంగా ప్రమాదవశాత్తు ఈ అర్హులలో చనిపోయినవారి కుటుంబాలకు గ్రామ సచివాలయం నుంచి తక్షణ సాయంగా రూ.10 వేలు అందిస్తున్నాం...

మార్చి 2020 నుంచి కేంద్ర ప్రభుత్వం ఇన్సూరెన్స్ కన్వర్జెన్స్ స్కీమ్ స్థానంలో అర్హుల వ్యక్తిగత బ్యాంకు ఖాతాల ద్వారా బీమా చేయించాలని ఆదేశించింది. తదనుగుణంగా రాష్ట్రంలో అర్హులైన 1.41 కోట్ల కుటుంబాల తరపున బీమా ప్రీమియం మొత్తాన్ని రాష్ట్ర ప్రభుత్వమే భరిస్తూ 21.10.2020 నాడు బ్యాంకులకు చెల్లించినప్పటికీ కూడా, లబ్ధిదారులను నమోదు చేయడంలో బ్యాంకుల వల్ల జాప్యం జరిగినందున, సంపాదించే వ్యక్తి మరణించిన ఏ కుటుంబానికి అన్యాయం జరగకూడదని 12,039 బాధిత కుటుంబాలకు బీమా పరిహారానికి సమానమైన సొమ్మును కూడా మన జగనన్న ప్రభుత్వం తన నిధుల నుండే **నేడు** చెల్లిస్తుంది.

| కుటుంబంలో సంపాదించే వ్యక్తి మరణిస్తే,అందే బీమా ప్రయోజనాలు | | |
|---|---|---|
| సహజ మరణం | 18-50 సం॥లు | రూ. 2,00,000 |
| ప్రమాదం వల్ల మరణం లేదా | 18-50 సం॥లు | రూ. 5,00,000 |
| శాశ్వత అంగ వైకల్యం | 51-70 సం॥లు | రూ. 3,00,000 |
| పాక్షిక శాశ్వత అంగ వైకల్యం | 18-70 సం॥లు | రూ.1,50,000 |

బీమా నమోదు, క్లెయిమ్ చెల్లింపుల్లో ఫిర్యాదులకు సంప్రదించవలసిన టోల్ ఫ్రీ నెంబర్ :
**155214**

**ఇది ప్రతి పేద కుటుంబానికి అన్నివేళలా అండగా ఉండే జగనన్న ప్రభుత్వం...**

శ్రీ గుమ్మనూరు జయరాం, కార్మిక శాఖా మాత్యులు

IPR RO No. 04/Sou/Advt.II/2021-22 Dt.08-04-2021

జారీచేసినవారు: కమిషనర్, సమాచార, పౌర సంబంధాల శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

# The Kashmir of Andhra Pradesh
# LAMBASINGI

D.Sataroopa Datta



***In India, when we find a beautiful spot, preferably cold, we instantly compare it with Kashmir, the heaven on earth. We would rather draw parallel to this hidden gem of Andhra Pradesh to Ooty, but then Ooty never had snow. What are we talking about? It is a beautiful secret valley hidden in the dense forests of the Eastern Ghats, not far from Visakhapatnam. Lots of tourists visit Visakhapatnam, marvel at its beautiful beaches, museums, parks and food. But are you looking for something off the beaten track? We have the perfect solution. 4 hours away from Visakhapatnam, nestled in the strawberry and coffee plantations is Lambasingi, the place where the temperature goes down in minus in winter. Yes, you read that right.***

We suggest some sightseeing at Visakhapatnam first as to approach Lambasingi, it is the most convenient junction. Vizag is the City of Destiny, Waltair of yester years. Visakhapatnam is connected to all the major cities of India by many airlines and oh, yes, it is an international airport and a major railhead too. You will most definitely fall in love with this quaint east coast city and its offer of different trails of beaches, temples, tribes and wildlife. Clean and green Visakhapatnam has beautiful strands, gorgeous beaches and an offering of accommodation that ranges from urban to natural sanctuary, from reasonable and comfortable to the ultimate luxury of infinity pools.

In search of more, we shall proceed to Araku Valley next. Have you ever travelled in a vistadome coach? Well, this is your chance!! This is a special coach in the Kirandul Express, connecting Visakhapatnam and Araku Valley. There is a glasstop coach in the train to let you enjoy the view to the fullest as you move through the dense forests and picturesque locales of Andhra Pradesh. Did you know, this train crosses 46 tunnels on the way? There is something magical about plunging into the dark and coming out again in light so many times in a journey!! Araku is at a height of 2990 ft from sea level and 123 kms from Visakhapatnam. Now, you may also choose to take a scenic road route, if you do not want a train ride. In case, you are taking the road route, do make a stop at Tyda. The famous Jungle Bells Resort of Andhra Pradesh Tourism at Tyda is a beautiful experience.

Weather in Araku is just perfect hill station pleasant. Park yourself at a comfortable stay and let's explore Araku for sometime. Taking a dekko inside the famous Borra Caves is a must. The name comes from a hole at the top of the cave as Borra means hole in Odia. Borra Caves are the interconnected limestone caves where stalactite and stalagmites have made nature's own abstract sculpture from the ancient times. Stop at the tribal museum to know about the local





tribal culture, history and lifestyle. If you are a caffeine aficionado, then a halt at the Coffee Museum of Araku is a must for you.

70 kms from Araku is Lambasingi, the abode of clouds and green rolling hills. Once in Lambasingi, you will find yourself surrounded by strawberry and coffee plantations. The chill in the air can best be felt in the mellow morning light moments. Request your travel agent to arrange for tent accommodation in Lambasingi. Enjoy Bongulo chicken, the way tribes cook, the chicken staffed in bamboo sitting beside a roaring campfire. Sway with the beats of dhimsa, the tribal dance of Araku and walk into the myst of the clouds. Trekking through the small trails of Lambasingi into the forest can be very rewarding for your camera and a treat for your pollution choked city lungs. Solitary trails will take you to the hilltop through sighing rows of Eucalyptus. Thajangi reservoir nearby adds to the beauty spots of Lambasingi. Gushing water and peaceful surroundings is a favourite with the shutterbugs. The shopaholic in you wants to go on a spending spree? Shop local, shop authentic. A must buy in this trip is Araku coffee and fruit preserves . Do not forget to step into the local coffee, strawberry plantations and apple orchards.

Important note before you pack your bags for Lambasingi is to book your accommodation in advance. Take help from Andhra Pradesh Tourism and their booking website. The locals also offer homestays. You may also stay in Araku and go to Lambasingi for a day visit. Please keep in mind, these destinations are rich in biodiversity and poignant tribal culture. So, leave only your footprints behind and take care of the ecologically sensitive place. The best time to visit Lambasingi is December and January when it is the coolest of the year. If you are lucky, who knows, you may get to see some snowfall too!!

(Author is Assistant Director-India Tourism, Hyderabad)



*Borra Caves*

Pilgrimage

# CHIEF JUSTICE OF INDIA OFFERS PRAYERS IN S.V.TEMPLE - TIRUMALA

**భారత అత్యున్నత న్యాయస్థానం - 'సుప్రీమ్ కోర్టు' ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ నూతలపాటి వెంకటరమణ సతీసమేతంగా తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామి వారిని దర్శించుకొన్న దృశ్యమాలిక**











# GOLCONDA 'SHOW'



***Hyderabad is popular tourist destination. This beautiful city is replete with structures and palaces from older times. World tallest monolithic Buddha statue -Hussain Sagar Lake and Golconda Fort Taramati Baradari are best choices in Hyderabad. Hyderabad is the capital city of Telangana State.The Sound and Light show of Golconda Fort is one of the main tourist attraction.It is a spectacular Show. Step into Taramati Baradari is memorable one..***

Golconda Fort is situated in the Western part of Hyderabad. Golconda fort is spread over an area of 3 square kms and length is 4.8 kms . One interesting phenomenon observed in Golconda Fort is that.. a person stands at a point near the dome entrance and make sound, it can clearly be heard at the hilltop pavilion. Pavilion is at a distance of one km. That is sound and resound system with ancient technology. Resound system was used as warning and alert system,when enemies entered in to the fort. Now, it became entertainment for tourists.

Golconda Fort comes to life with Sound and Light show. Show explains the history of the fort, its rise and fall. When the sun goes down the first show starts. It was an hour long show depicting the glorious past of this grand fortress. Neon lights shined through all sections of the fort with a loud speaker giving the story; in a mixture of English, Hindi, and Telugu.



Show info : 1st Show English (All Days) and 2nd Show in Telugu on Monday, Wednesday & Friday, and Hindi on Tuesday, Thursday, Saturday & Sunday.

*(For more information please contact T.S.Tourism Development Corporation).*
*www.tstdc.in*

## TARAMATI BARADARI



Taramati Baradari is located at Ibrahimbagh on Gandipet Road and just outside the Golconda Fort.It is one of the popular monuments of Hyderabad. Taramati Baradari is consisted of a Music hall with 12 entrances. It was used an auditorium. Taramati has been situated on the top of the hill, This place has great acoustics and because of its association with Taramati, who dedicated her life for dance and music, Presently, it is a cultural complex - run by TSTDC. Various events,music concerts, dance performances and exhibitions are being conducted. The complex is consisted of a large open auditorium, along with a conference hall and business centre. The open auditorium has a seating capacity of 1,600 persons.Conference hall can accommodate 500 persons. Taramati Baradari complex is the symbol of Royal legacy of Ibrahim Kuli Qutub Shah.

Tourism News (Telugu Bi-Monthly) May - June 2021 and July - August 2021, Volume : 14 Issue : 3 & 4 RNI No. APTEL / 2007 / 22572. www.issuu.com/mynaaswamy. Printed, Published and Owned by MyNaa Swamy and Printed at C.N. Printers, Prakasam Road, Tirupati and Published at No. 19-12-372, Bairagipatteda, Tirupati - 517 501. Editor : MyNaa Swamy. Ph : 95026 59119 Email : tourismnews2007@yahoo.co.in

